# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక

వెల : రూ॥ 4 ఆగస్టు-1995



దక్షిణ భారత
హిందీ ప్రచార సభ-
ఆంధ్ర, హైదరాబాదు.



## దక్షిణ భారత హిందీ ప్రచార సభ—ఆంధ్ర

# హిందీ ప్రచారకులకు మనవి

1995—96 సం॥ కేంద్రప్రభుత్వ ప్రణాళికలో నియమించ బడిన హిందీ మహా/విశారద/ టంకణ విద్యాలయాలు మరియు సహాయక ప్రచారకులకు సంబంధించిన ప్రభుత్వ గ్రాంటు యింత వరకు అందలేదు, త్వరలో అందగలదని ఆశిస్తున్నాము. గ్రాంటు అందగానే, సహాయక ప్రచారకులందరికి ఓచరు ఫారములు మరియు తదితర ఫారములన్నియు పంపగలము.

1996 మార్చి సెషనుకు సంబంధించిన సహాయక ప్రచారక ఆవేదన పత్రములను పంపి, ఆయా తరగతి విద్యార్థుల నెలసరి కార్యవివరములను నియమానుసారంగా, ఆంధ్ర సభ కార్యాలయమునకు పంపవలసినదిగా సహాయక ప్రచారకులను కోరడమయినది.

కార్యదర్శి

టెలిగ్రామ్ : హిందీసంఘ్ ఫోన్ ; 316865

# 497

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

అగస్టు–1995

Dr.

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర
ఖైరతాబాదు, హైదరాబాదు–500 004

సంవత్సర చందా 40–00
విడిప్రతి 4–00

Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings sl No. 30/55 dated 6th January-1955.

---

# ఈ సంచికలో

సంపాదకీయం

# తెలుగు కవుల శత జయంతి ఉత్సవాలు

రెండు సంవత్సరాల ఈ మధ్యకాలంలో తెలుగు సాహిత్యాకాశంలో జాజ్వల్యమానంగా వెలిగిన పలువురు మహాకవుల, సాహితీవేత్తల, పండితుల శతజయంతి ఉత్సవాలు జరగడం ఎంతో సంతోషదాయకం. కీర్తిశేషులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, కవికోకిల దువ్వూరి రామిరెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, గుఱ్ఱం జాషువా గార్ల శత జయంతి ఉత్సవాలు జరిగినవి జరుగుతున్నవి. వీరంతా ఉత్తమ శ్రేణికిచెందినకవులు, పండితులు. తెలుగుసాహితికి ఎనలేని గౌరవాన్నీ ఆదరాన్నీసంపాదించి పెట్టినవారు. విశ్వనాథవారు కవి సమ్రాట్టు. జ్ఞానపీఠ బహుమతి గ్రహీత రామాయణ కల్పవృక్షం వంటి మహాకావ్యాన్నీ వేయిపడగల వంటి ఉత్తమ నవలనూ తెలుగు వారికి అందించినవారు సాహిత్య ప్రక్రియలలో వారు తొక్కని పుంతలేదు. వారు విశ్వసాహిత్యంలో తెలుగుకు స్థానం కల్పించినవారు. శ్రీ అడవిబాపిరాజుగారు సుప్రసిద్ధ చిత్రకారులు. నవలా రచయిత. కథానికా నిర్మాత. కవులు జానపద శైలిలోనూ, సంప్రదాయబద్ధమైన శైలిలోనూ కావ్యరచన చేసినవారు. కళాశాలి. నారాయణరావు, గోన గన్నారెడ్డి, కొంటెకోణంగి హిమబిందు వంటి ఉత్తమ నవలలు రచించినవారు. కవి కోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు కండగల తెలుగులో పానశాల, కృషీవలుడు వంటి ఉత్తమ కావ్య ఖండికలను తెలుగు సాహిత్యానికి అందించినవారు. సురవరంవారు మహాపండితులు. ప్రతిభావంతులు గొప్పవిమర్శకులు వీరి ఉత్తమోత్తమ రచన ఆంధ్రుల సాంఘిక చరిత్ర. వారు గోలకొండ పత్రికను స్థాపించారు, సంపాదకులుగా పనిజేశారు. వారు దాశరథిగారి మాటల్లో మూగవడిన తెలంగాణ మూల్గిన తొలినాటి ధ్వని. తెలంగాణానికి తెలుగుబిక్ష పెట్టినవారిలో అగ్రగణ్యులు. గుఱ్ఱం జాషువాగారు దీనుల, దళితుల, అన్నార్తుల ఆక్రందనలకు ప్రతినిధిగా నిలచి వారి కష్టాలను తన కష్టాలుగా భావించి, అనుభవించి హృదయాలు

కళానుభూతిలో అయితే, కళాకృతి ద్వారా పొందిన ఎన్నో భావాలూ, ఆ భావాల పరిపక్వత వల్ల పొందిన ఎన్నో అనుభూతులూ, ఆ అనుభూతులన్నీ మన హృదయాంతరాళాంలోఎన్నో అవ్యక్తమైన భావాలను మన హృదయానికి తెలుపుతూ ఉన్నాయి. కనుక భావము అన్నది కళాకృతికి ఉత్తర భాగంలోనూ ఎంతో భావజగత్తును కలిగి ఉన్నది.

ఇలా కళాకృతికి ముందూ వెనుకా, కళాకృతి సృష్టిసమయంలోనూ, ఎంతో అనంతమైన భావ జగత్తు అన్నది ఉన్నది.

కళలోగల అనంతమైన ఈ భావ్యజగత్తు అంతా సుందరమయమూ రసమయమూ.

ఇలాంటి ఈ భావజగత్తును కనుక, కళాసృష్టి జరుగుతున్నప్పుడు కళానిర్మాణ దృష్టితో పరిశీలిస్తే మరికొన్ని నూతన అంశాలు మనకు అవగతమవుతాయి

ముఖ్యంగా కళా నిర్మాణ సమయంలోగల భావము, రెండు లక్షణాలు గలదిగా ఉంటుంది. ఆ రెండు లక్షణాలతో భావం అన్నది రెండుగా విడిపోతుంది. అయినా అవి రెండూ ఏకకాలంలో ఏకముఖంగానే రససృష్టిలో, రససృష్టికొరకు పనిచేస్తూనే ఉంటాయి.

అందులో ఒకటి రసలక్షణం కలది, మరొకటి కళానిర్మాణంలోగల సాంకేతిక లక్షణం కలది.

రెండవది కళాసృష్టి జరుగుతున్నప్పుడు; కళను నిర్మించటానికి ఉన్న పదార్థాన్ని, ఎలా మలచితే ఆ పదార్థంలో సుందరత వస్తుంది అనే లక్షణానికి చెందినది.

అంతేగాక, రసభావాన్ని ఆకళలోకి ఏ సాంకేతిక అంశము ద్వారా వ్యక్తం చేస్తే, ఆ రసభావం ఆ ఆ కళామాధ్యమంలో అందంగా ఉంటుంది: ఆ రసభావం ఆ కళలో ఉత్కృష్టంగా ఉదాత్తంగా ఇమిడి వ్యక్తమౌతుంది, అనే అంశాన్ని ఈ సాంకేతిక కళానైపుణ్యభావం ప్రధానంగా చూస్తూ ఉంటుంది.

ఈ రకమైన కళానైపుణ్యభావంలో; కళాకారుడు అంతవరకు అభ్యసించి సాధించుకొన్న భావాలు, అతనిలో పెరిగిన సాంకేతిక భావ కల్పనలూ ఉంటాయి. అందుకని కళాసృష్టి సమయంలో కళాకారునితో కళామాధ్యమంలోని పదార్థ నిపుణతే ప్రాధాన్యత వహిస్తూ ఉంటుంది.

ఈ కళా సాంకేతిక నిపుణతకు సంబంధించిన అంశాలు. ఆయా కళా పదార్థాలలో ఎక్కడెక్కడ ఎలా ఉంటాయి అని కనుక విహంగవీక్షణగా చూస్తే—

కళానిర్మాణానికి తోడ్పడిన పదార్థంలో. ఆపదార్థ కర్మణ్యత్వంలో ఆ అంశాలు పూర్తిగా ఆవరించి ఉంటాయి అని తెలుస్తుంది.

అవి

సాహిత్యంలో శబ్దార్థపదార్థ నైపుణ్యంలోనూ

సంగీతంలో రాగంలోని స్వర, లయ కల్పనలోనూ

నాట్యంలో భంగిమల లయ విన్యాస పదార్థంలోనూ

చిత్రలేఖనంలో రంగుల రూపాల పదార్థంలోనూ

శిల్పంలో శిల్పం రూపొందించటానికి ఎన్నుకొన్న పదార్థం లోనూ ఉంటాయి.

వీటిని ఇంకాస్త విశదీకరించుకొని చూస్తే—

సాహిత్యంలోని సౌందర్యమంతా సాహిత్య శాస్త్రాలైన అలంకార శాస్త్రాలలోనూ, ఛందో శాస్త్రంలోనూ ఉన్నది. ఒక రసభావాన్ని అందంగా చెప్పటానికి అలంకార శాస్త్ర అవగాహన బాగా కావాలి. వాటిమీద సాహిత్యవేత్త సాధించిన అధికారం మీదా, ఆ భూమికలోని కల్పన మీదా సాహిత్య సౌందర్యం ఆధారపడి ఉంటుంది. సాహిత్యం ఇతర కళల వలె హస్త నైపుణ్యం కలది కాకపోయినా, అందులో శబ్దార్థ నైపుణ్యం అన్నది ఒకటి ఉన్నది. హస్తనైపుణ్యం వెనుక ఎంత సాంకేతిక పరిజ్ఞానం అన్నది ఉన్నదో, అంతే సాంకేతిక నైపుణ్యం లాంటి శబ్దార్థప్రయోగ నైపుణ్య పరిజ్ఞానం సాహిత్య రచన వెనుక ఉన్నది అది సాంప్రదాయ ఆధునిక రచనా రీతుల రెంటిలోనూ ఉన్నది.

ఓ కవి ఓ కవితాసృష్టి చేస్తూ ఉన్నప్పుడు, ఆ కవితా నిర్మాణంలో రస భావంతో బాటు, సాహిత్య పదార్థంలోని శబ్ద నైపుణ్యం వెనుకనున్న పద—అర్థ—ధ్వని మొదలైన సాంకేతిక పరిజ్ఞాన భావమూ ఉంటుంది. అది అతని లోని రసభావానికి సమాంతరంగా ఏకకాలంలో కవితా సృష్టి సమయంలో సాగిపోతూ ఉంటుంది.

సంగీతకళ లోని మాధుర్యమంతా రాగంలోని స్వరకల్పనలో గల ఆలాపన మీదా, అందులోని జీవస్వర గమక చమత్కృతి మీదా, తాళగతి నడకల మీదా ఆధారపడి ఉన్నది. ఈ రాగంలో చేసే స్వరకల్పనకు గాయకుని కంఠంలో పట్టే సంగతుల స్వర నైపుణ్యం మీద కూడా ఆధారపడి ఉన్నది. కనుక సంగీత కళలోని సాంకేతిక అంశం అన్నది రాగాలాపన లోని స్వరకల్పన మీదా, వివిధ స్వరకల్పనలను వివిధ కాలాల్లో పాడే నైపుణ్యం మీదా ఆధారపడి ఉన్నది. అంతే గాక రాగంలోని స్వరాల మీద ప్రయోగించే వివిధ గమక ప్రయోగ చమత్కృతుల మీదా ఆధారపడి ఉన్నది.

అలానే వాద్యంలో గల వాదన సౌందర్యమంతా, కావలసిన స్వరాల స్థానాల మీదా, కావలసిన విధంగా, వివిధ కాలాలలో, వివిధ గమక చమత్కృతులతో నడిచే వ్రేళ్ళ సాధన మీద ఆధారపడి ఉన్నది. కనుక వాద్యవాదనలోని నాద సౌందర్యం అన్నది హస్త నైపుణ్యతలోని సాధన మీదా, ఆ సాధన లోని చమత్కార విశిష్టతల మీదా ఆధారపడి ఉన్నది. కనుక సంగీత కళలో, రసభావంతో బాటు సంగీతశాస్త్రం నేర్పిన స్వరపల్లవుల నైపుణ్యం సాంకేతిక కల్పనలో గల సాంకేతిక ఆలోచనా భావమూ, సంగీతకళలోని రసభావము సరసనే సాగిపోతూ రసభావమునకు పుష్టినిచ్చి పరిపుష్టతను చేకూరుస్తున్నది.

చిత్రలేఖనంలో సౌందర్యం అన్నది రూపం లోనూ రూపాల కూర్పులోగల తూకంమీదా, రంగుల సామరస్యం మీదా, రంగుల సమ్మేళనం మీదా, రేఖల నిపుణత మీదా ఆధారపడి ఉన్నది. ఈ రెండు కాకుండా చేతిలోని కుంచె, ఇతర పరికరాల నైపుణ్యం అనేక మీద ఆధారపడి ఉన్నది : టెక్నిక్స్.

కనుక చిత్రలేఖన నిర్మాణంలో హస్త నైపుణ్యంలోని సాంకేతిక అంశాలమీద కదలాడే అనేకభావాలు చిత్రలేఖనంలోని రసభావం సరసన రూపసృష్టిలో టెక్నికల్‌గా సాగిపోతూ ఉంటాయి

శిల్పకళలో మూర్తి నిర్మాణంలో అనేక సాంకేతిక అంశాలు ఉన్నాయి. ఈ కళలో నిష్ణాతను పొందటానికి హస్తనైపుణ్యం కావాలి. శిల్పానికి ఎన్నుకొన్న పదార్థం నుండి శిల్పం రూపొందుతున్నప్పుడు, ఆ పదార్థ తత్వాన్ని బట్టి శిల్ప నిర్మాణ కౌశలంలోని వివిధ భావాలు రస భావం సరసన చేర్పు వేసుకొని రసభావంతో బాటు సాగతుంటాయి. అనుక్షణమూ నిర్మాణ సాంకేతిక అంశముమీదే శిల్పిదృష్టి, ఆ దృష్టిలో మెదిలే సాంకేతిక పనితనపు భావాలే అధికంగా ఉంటాయి. ఐనా రసభావం మాత్రం వీటి నుండి ఏ మాత్రం అదృశ్యంకాదు, తన మౌలికతను ఎప్పుడూ దాటి పోదు

నాట్యకళలోని కళాకారుడు తన శరీరంమీద ఆపాదించుకొన్న భంగిమల రచనలోని సౌందర్యము మీదా, అందులోని సాంకేతిక అంశాల మీదా దృష్టి ఉంచుతాడు. కనుక అతని దృష్టి భంగిమను పట్టే తన దేహం ఎంత వరకూ భంగిమల శాస్త్ర ప్రమాణాన్ని కలిగి ఉన్నది. దాని ద్వారా, దాని విన్యాసము ద్వారా రసభావం ఎంత వరకు వ్యక్తమౌతున్నది. అనే సాంకేతిక అంశం మీదే ఆధారపడి ఉంటుంది. నాట్యంలో ఉన్న ఈ భంగిమలూ వాటి విన్యాసాలే కాకుండా, నాట్యంలోని భావాలనూ అర్థాలనూ తెలిపే హస్తముద్రల కల్పనలోనూ, దృష్టిభేద విన్యాసాలలోనూ లయాత్మక అడుగుల లోనూ అతని భావం తిరుగుతూ ఉంటుంది. కనుకనాట్యం వెనుకనున్న భంగిమలకు భంగిమ విన్యాసాలకు భంగిమ విన్యాసాలకువదార్థమైన దేహ భంగిమ కౌశలము, హస్తముద్రల కౌశలమూ నేత్ర దృష్టుల లక్ష్యత మొదలైన వాటిలోగల సాంకేతిక భావం నటుని రసభావం సరసనే ఉంటుంది. అంతేకాకుండా సుందరమైన ఈ భంగిమల విన్యాసాలు, వివిధకాలాల్లో వివిధ జతులతో కదలాడే విన్యాసాల హొయల మీదా నటుని దృష్టియున్నప్పు కళా సృష్టిలోగల రస భావంతో బాటు అడుగులువేస్తూ ముందుకు సాగి పోతూ ఉంటుంది.

ఇవన్నీ సాంప్రదాయ కళానిర్మాణంలోని బంధనాలు, సాంప్రదాయ నియతి రాహిత్యమై బంధవిమోచన గల ఆధునిక కళా నిర్మాణంలో ఈ అంశాలు ఎలా ఉన్నాయి అని ఆలోచిస్తే—

బంధవిమోచను పొందిన ఆధునిక సాహిత్య నిర్మాణం, అందం అనడాన్ని అంగీకరించక పోయినా, హృదయాన్ని పట్టి పిండేస్తూ చెప్పటం, పాఠకుని ముక్కుకు తాడువేసి లాక్కెళ్ళేలా చెప్పటం, అనే లక్షణాన్ని అంగీకరిస్తూ ఉన్నది. ఆధునిక సాహిత్యానికిగల లక్షణానికి నిర్వచనం దినపత్రికలలో వార్తను అందించే వాక్యానికి— హృదయానికి హత్తుకునేలా చెప్పగలిగిన చిన్న పదాల పాదాల వచన కవితలకు మధ్య ఏభేదం అయితే ఉన్నదో; అదే ఈనాటి సాహిత్యంలోని సౌందర్యతత్వం. లేక సాహిత్య తీవ్రగుణతత్వం. ఈ అంశాన్ని చాలావరకు ఈనాటి సాహిత్య జగత్తు అమోదిస్తున్నది కనుక ఈనాటి సాహిత్యంలో ప్రాచీన అలంకార ఛందోశాస్త్రాలు లేకపోయినా నూతనమైన సాహిత్య వ్యక్తీకరణతత్వం అన్నది ఒకటి ఉన్నది. అది సాధించటానికి రచయిత కొంత సాధన చేయవలసి ఉంటుంది. ఆ నూతన సాహిత్యతత్వాన్ని కొంత అవగాహన చేసుకోవలసి కూడా ఉంటుంది. కనుక అధునాతన సాహిత్య నిర్మాణంలోనూ, సౌందర్య తత్వానికి సంబంధించింది అని అనకపోయినా, హృదయానికి గాఢంగా హత్తుకునేలా చెప్పటానికి సంబంధించిన

ఒకానొక శబ్దార్థ నిర్మాణ కౌశలం అన్నది ఒకటి ఉన్నది దానిమీద లక్షణ గ్రంధాల్లాంటి వ్యాస గ్రంథాలు ఉన్నాయి. ఈ అంశం మీద విశ్వ విద్యాలయాల్లో పరిశోధనలూ జరుగుతున్నాయి. ఆధునిక రచయితల్లోనూ, రసభావం సరసన అతలిలో కవితా నిర్మాణానికి సంబంధించిన ఆధునిక శబ్దార్థ (సంకేత) సాంకేతిక భావన అన్నది ఒకటి అతనికి తెలియకుండగనే అతనిలో సాగిపోతున్నది

అలానే ఆధునిక సంగీతం ఎంత స్వేచ్ఛను పొంది, ఎంత విశృంఖలతను పొందినా అది హార్మనైజింగ్ లాక్షణికతనూ, అందులోని సాంకేతిక నైపుణ్యాన్ని తన స్వరరచనలో కలిగిఉంది. అత్యాధునికమైన పాప్, జాజ్ మొదలైన సంకేతాలలో ఆదిమజాతులలో గల స్వరబాణీల ఛాయలనూ అసమ్మిలయ రీతులనూ, విచిత్రగతులనూ అందులోని విచిత్ర సాంకేతిక విధానాల రీతులనూ అవి కలిగి ఉన్నాయి. అడ్వాన్స్డ్ సంగీతం పీటికి ఎంతో చోటు ఇస్తోంది. అందులో చిట్ టెక్నిక్స్ ఉన్నాయి కనుక అధునాతన సంగీతం వాస్తవ ధ్వనులను అపశ్రుతులను కూడా చక్కగా తనలోకి ఇముడ్చుకొంటున్నది అందులో కొంత వినూత్న స్వర సాంకేతిక అంశమూ ఉన్నది. కొంత యాంత్రిక యుక్తి (కొడియోలోలా) ఉన్నది.

ఇవన్నీ కళా కారునిలో సాంకేతిక భావాన్ని పెంపొందింపచేసేవే కనుక ఆధునిక సంగీతదశలోను రసభావం వెనుక సాంకేతిక భావ ఆలోచన ఉన్నది.

ఆధునిక నైరూప్య చిత్రకళలో సారూప్య రూపభావం లేకపోయినా, నైరూప్య నిర్మాణంలోని మర్మతను తెలిపే శాస్త్రాలు, చిత్రకళా పరిణామాన్ని తెలిపే శాస్త్రాలూ ఉన్నాయి. కుంచె నైపుణ్యమే కాక, ఆధునిక వైరూప్య చిత్రాలను వాటి శైలులను చిత్రించే మరికొన్ని పరికరాల పరిజ్ఞానమూ, నూతనవిధానాలూ. వాటి నైపుణ్యమూ దాన్ని పొందిన హస్తనైపుణ్యమూ అన్నదీ ఉన్నది. ఇందులో మరో క్రొత్త సాంకేతికతా, దాని శాస్త్రాలూ . అవి రేపే సాంకేతిక ఆలోచనా ధారా నైరూప్య రసభావం సరసన ఉన్నది.

వాస్తవ రూపాలు లేని నైరూప్య శిల్పంలో అమూర్తమూర్తుల నిర్మాణంలో నైపుణ్యత (క్రొత్తగా శిల్పకళలో వచ్చే పదార్థాలూ వాటి తత్వాలలో) ఉన్నది. ఈ నైపుణ్యత వెనుక ఎంతో ఆధునిక నిర్మాణ సాంకేతికత ఉన్నది. అంతేగాక ఆధునిక శిల్పకళ లోని పరిణామమూ, దానితో బాటు శిల్ప నిర్మాణం లోని సాంకేతిక పరిణామాన్ని తెలిపే పరిజ్ఞానమూ ఉన్నది. అందులో ఈనాడు రకరకాలుగా అభివృద్ధి పొందిన విజ్ఞానశాస్త్రాలూ ఈ ఆధునిక శిల్పకళకు అనుబంధంగా ఉన్నాయి.

కాకపోతే ఈ రెండు దృశ్యకళలూ వాస్తవ రూపాలు, లక్షణ శాస్త్రాలను ఒదిలి, నైరూప్యలక్షణాలను అందులోని సాంకేతిక నైపుణ్యాన్నీ మేళో చమత్కార నైపుణ్యాన్నీ కలిగి ఉన్నాయి.

బహు ముఖాలనుండి వచ్చే భావాలు ఏకము ఖంనుండి వస్తున్నట్లూ, ఏకముఖం నుండి వస్తున్న భావాలు బహుముఖాంనుండివస్తున్నట్లూ ఉంటాయి ఈ ఆధునిక రూపకళలో ఏకముఖంలో బహుముఖాలూ, బహుముఖాలలో ఏకముఖం కనిపిస్తూ ఉంటాయి. అంతే ఒకరూపంలో అనేకరూపాలూ, అనేకరూపాలు ఒకేరూపంగాను కనిపిస్తుంటాయి అందుకనే ఒకే రూపంగానూ కనిపిస్తుంటాయి. అందుకనే ఒకరూపభావంనుండి ఎన్నో రూపభా

వాలూ, ఎన్నో రూపభావాలనుండి ఏకరూప భావమూ వ్యక్తమవుతుంటాయి ఈ ఆధునిక రూపకళలనుండి.

ఇలాంటి సాంకేతిక అంశాలన్నీ ఈ రెండు రూపకళల్లో నిండి ఆలోచనాభావాలను వ్యక్తంచేస్తూ రసభావాన్ని వ్యక్తం చేస్తుంటాయి. ఈ కళల నిర్మాణంలో మౌళిక రసభావం సరసనే ఈ సాంకేతిక భావాలూ కళాకారునిలో సాగిపోతూ ఏక ముఖంగా పనిచేస్తుంటాయి ఈ రూపకళల నిర్మాణ కార్యక్రమంలో.

ఆధునికంగా అభివృద్ధిపొందిన అభినయంలో సాంప్రదాయ నటన భంగిమలేదు. అందుకు తగిన ఆదర్శ సౌందర్యాన్ని ధ్యేయంగా పెట్టుకొన్న శరీర సాధనలేదు. కానీ భావాన్ని శరీరం ద్వారా. శరీర అవయవాలద్వారా వ్యక్తంచేసే సాధన అంటూ ఒకటి ఉన్నది. ఆ సాధనలో కొంత నైపుణ్యం ఉన్నది. ఆ నైపుణ్యం వెనుక శరీర అవయవాలు సాధించిన కొంత సాంకేతిక కౌశలం ఉన్నది. అందులో డైలాగ్ డెలివరిలోని మాడ్యులేషన్ ఫీలింగ్స్‌ను ఎక్స్‌ప్రెస్ చేయుటం అన్న సాంకేతిక అంశాలు ఉన్నాయి. వీటిమీద కలిగే ఆలోచనలన్నీ నటుడు విలీనమై నటించే రసభావం సరసనే ఉంటాయి.

పోతే అధునాతనమైన బ్రేక్ డ్యాన్సుల్లో ఎన్నో విచిత్రమైన భంగిమలు స్ట్రిక్స్ చిత్రాతి విచిత్రమైన భంగిమల విన్యాసాలూ, అవయవాలు విన్యాసాలూ ఉన్నాయి. వాటికే కొంత ఆధునిక నియతిఅన్నది ఉన్నది. కనుక నియమబద్ధంగాలేని వాటికి కూడా కొంత నియమబద్ధత అన్నదిఉన్నది. కాకపోతేఅది సాంప్రదాయకంగా కాకపోవచ్చు. అందుకనే అందులో కొంత సాంకేతిక నైపుణ్య సాధనా ఉన్నది.

కనుక సాంప్రదాయ కళా నిర్మాణంలోని శాస్త్రం లక్షణాలను అందులోని సాంకేతిక నైపుణ్యాన్ని ఆధునిక కళలు వదులుకున్నా, వాటి స్థానంలో ఆధునికమైన సాంకేతిక నైపుణ్య నిపుణతలు ఆయాకళా నిర్మాణంలో బాగా చోటు చేసుకొన్నాయి అని అవగతమౌతుంది పరిశీలిస్తే.

## 3

ఈ సాంప్రదాయ, అధునాతన కళానిర్మాణాలను పరిశీలించిన తరువాత కళలోని సౌందర్యం దేనివలన ఆవిర్భవిస్తున్నది అని సూటిగా ప్రశ్నిస్తే-

కళలోని సాంకేతిక నైపుణ్యం కళాకారునిలో కలిగించిన ఒకానొక సృజనాత్మకమైన ఆలోచనా నిర్మాణంవల్ల కలుగుతున్నదని చాలవరకు అంగీకరించక తప్పదు. ఇలా అనటం రసభావాన్ని త్రోసివేయటం కాదు.

ఒకరకంగా ఆలోచిస్తే—

ఏదో ఓరూపంలో అలంకార ఛందోశాస్త్రాలూ, హృదయానికి హత్తుకునేలా చెప్పే అధునిక కవితా ఎక్స్‌ప్రెషన్స్, అందుకు తగిన నడకలూ లేకుండా సాహిత్యంలేదు.

స్వరగమనం వెనుక చమత్కృతే, ట్రిక్స్ టెక్నిక్స్ లేకుండా సంగీతం లేదు.

రూప నిర్మాణ కౌశలమూ, రంగుల సామరస్యమూ లేకుండా చిత్రకళలేదు.

మూర్తిలయ నిర్మాణ కౌశలము అరూప రూపాల కూర్పు (అబ్‌స్ట్రాక్టు ఫారమ్స్ కాంపోజిషన్) లేకుండా శిల్పకళలేదు.

భంగిమ నిర్మాణం లేకుండా, ఫీలింగ్స్ లేకుండా అభినయంలేదు. స్టైల్ అన్నది లేకుండా ఆధునికమైన డ్యాన్స్‌లేదు.

కళాసృష్టిలో రసభావము ఒక ఆలంబన. నిజానికి కళాసృష్టిలోని సౌందర్య నిర్మాణమూ అందులోని కల్పనా అంతా రసభావంతో బాటు ప్రయాణించే కళాకారుని సాంకేతిక ఆలోచనలమీదే ఆధారపడి ఉన్నది అని అనుకోవటం అంత పొరపాటుకాదు. కాకపోతే ఇది బాహ్యంగా కనిపించదు.

బాగా ఆలోచిస్తే—కళాసృష్టిలోని భావమూ, అందులోని భావజగత్తు అంటే, రససంబంధిగానే ప్రసిద్ధమైందికానీ, కళాసృష్టిలోని సౌందర్యతత్వం అంతా కళాకారుడు చేసే కళాసౌందర్య సాంకేతిక నైపుణ్యంలోని ఆలోచనలమీదే ఆధారపడి ఉన్నది, అది అవగాహన చేసుకోవటం అరుదు అది అంత సులువైన విషయం కాదని అనిపిస్తుంది. ఇలా అంటున్న మాత్రాన కళానిర్మాణంలో రసభావాన్ని త్రోసివేసినట్లుకాదు.

కళలో కళాకారుడు మహోన్నత సౌందర్యాన్నీ ప్రగాఢమైన రసాన్నీ సాధించాలి అనే తపనతో ఈ సాంకేతిక పరిధిలో మునిగిపోతాడు కళా నిర్మాణంలో. తిరిగి అతను తన కళాసృష్టి పూర్తయిన తరువాత ఎప్పటికోగానీ కన్నుతెరవడు. అప్పుడు కళలోని రసభావం అన్నది అతని చుట్టూ అతన్ని ముంచివేస్తుంది. కనుక కళాజగత్తులో కళాకారుడు ఎంతపెద్ద ఈస్థటిక్ టెక్నీషియన్ అయినా అతని కళా సౌందర్యానికి దాని నిర్మాణానికి సాంకేతిక ఆలోచనలే జీవం అని మౌనంగా గుర్తిస్తున్నాడే గానీ, వ్యక్తం చేయలేక పోతున్నాడు. ప్రసిద్ధమైన రసభావమే కళా సౌందర్యానికి జీవమూ జీవనాడి అని రససిద్ధాంత వాదిలా అయిపోతున్నాడు, కళాజగత్తులోని సౌందర్య సాంకేతిక నిపుణుడు, సౌందర్య రస హృదయుడు అయిన కళాకారుడు, కళానిర్మాణానికీ, కళాకారునిలోని ప్రేరణకూ, కారణ మౌతున్నది రసభావం. అవి అతనిలోనూ కళలోనూ మొదటి నుంచీ మేళిరకంగానే ఉంటుంది. కానీ సాంకేతిక భావం రసభావాన్ని కళలో కళాకారునితో రమణీయంగా నిర్మాణం చేయిస్తున్నది.

కళాకృతి ఎప్పుడూ తనలోని రసభావాన్ని వ్యక్తపరుస్తూ దానిని ప్రకాశింపజేస్తూ ఉంటుంది. ఆ రసభావకిరణాలతోబాటు మరికొన్ని భావ కిరణాలు కూడా ఆ కళాకృతి నుండి ఎప్పుడూ ప్రసారమౌతూనే ఉంటాయి. ఆ కిరణాలలో ఆ కళాకృతి మలచబడిన సాంకేతిక సౌందర్య నైపుణ్యత వెలుగుతూ ఉంటుంది. దాన్ని తోటి కళాకారులు కళలోని రహస్యాన్ని గ్రహించటానికి గ్రహిస్తారు. పరిశీలకులూ దాన్ని చూస్తారు. కొంత వరకు గ్రహిస్తారు. శాస్త్రీయంపాదిగా ఆలోచిస్తే, ఇదంతా కళాకారునికే కాకుండా కళాకృతిని ఆస్వాదిస్తున్న ఆస్వాదయితకు కూడా కొంత వరకు మౌనంగా గ్రహితం అవుతూనే ఉంటుంది. అయితే దానిని అతను రసభావాన్ని గుర్తించినంతగా గుర్తించలేడు. అతనిలోనే కనుక అనుభూతి హృదయంతోబాటు కొంత అన్వేషణాత్మకమూ కూడా తెరువబడి ఉంటే, అతను కళాకృతిని పరిశీలనగా చూడగలడు. ఆ తరువాత ఆ కళా నిర్మాణంలో గల నైపుణ్యమూ దాని అవగాహనతో కళాకారుడు కళలో నిక్షిప్తపరచిన సాంకేతిక ఆలోచనలనూ వానిని ఆ కళలో పొదిగిన నేర్పరితనాన్ని అందులోని కల్పననూ గ్రహించగలడు.

అప్పుడు అతను కళాకృతి ప్రసారము చేసే రసభావ సౌందర్యముతోబాటు, ఆ కళాకృతి ప్రసారము చేసిన సాంకేతిక సౌందర్య నిపుణతనూ ఆస్వాదించే పూర్ణ కళాస్వాది అవుతాడు.

ఇలాంటి దశలో కళను గురించి ఆలోచిస్తే, కళలో గల ఈ రసభావమూ, ఈ సాంకేతిక భావము అన్నవి రెండూ కళరూపొందటానికి సమస్థాయితో చేయబడి సమప్రతిపత్తి కలిగించేవి ఔతున్నాయి ఇవి ఒక్కదాని బాటున మరొక్కటి ఉండి కళతోనూ, కళాకారునితోనూ, కళాస్వాదితోనూ దోబూచులాడుతుంటాయి.

ఈ రెంటిలో ఒకటి లేక మరొకటి ఉండ లేదు ఒకటి ఉన్నప్పుడు మరొకటి తప్పక ఉండి తీరుతుంది.

కళ రూపొందే పదార్థంలోగల సాంకేతిక పరిజ్ఞానం దాని నేర్పరి తనంతోనే కళాసృష్టిని చేయలేము ఓవేళ అలా కళాసృష్టి చేస్తే, అది రసదృష్టిలో కళా కృతి కానేరదు. అలానే కేవలం రసభావాన్నే ప్రధానంగా తీసుకొని కళాసష్టిని చేయలేము. ఒకవేళ ఆలాచేస్తే అది కళాపదార్థంలో కళాత్మకంగాచమత్కారంగా ఇమడలేదు ఎందుకంటే కళాపదార్థంలో రసభావం జరగటానికి తగిన నేర్పరితనం అక్కడ చోటు చేసుకోలేదు కనుక అప్పుడు అది సుందరంగా రూపొందని రసభావనమే ఔతుంది గానీ కళగా రూపొందిన రసభావంకాదు. యథార్థానికి కళాసృష్టిలో రసభావాన్ని పదార్థంలో అందంగా పోయగల అందంగా ఇమడ్చగల నేర్పరితనం కావాలి. కళాకారునికి, ఆనేర్పరి తనమే కళాజగత్తులోని సాంకేతిక పరిజ్ఞానభావం అది లేకపోతే రసభావం దోవ రసభావానిదే, కళాపదార్థందోవ కళాపదార్థానిదే, ఈ రెంటిని అనుసంధానం చేసి అన్వయం చెసేది కళాసృష్టిలోగల కళాపదార్థం యొక్క సాంకేతిక పరిజ్ఞాన భావమూ అందులోని ఆలోచనలూ అందులోని కల్పనలూ అందులోని చమత్కృతులున్నూ.

కనుక ఇవిరెండూ సమస్థాయిలో కలిసినప్పుదే కళాసృష్టి జరుగుతుంది. రస చమత్కార స్థాయీ భావన ఆవిర్భవిస్తుంది.

అందుకనే కళయొక్క బహిర్ చేతన రసభావం, కళయొక్క అథోచేతన ఔతున్నది రససృష్టిలో.

రసభావం మీద, సాంకేతిక భావం నిర్మాణమైతే, సాంకేతిక భావంలో రసభావం తిష్టవేసుకుని కూర్చుంటుంది రసజగత్తులో.

సాంకేతిక భావం కళాజగత్తులో వస్తువు అయితే; రసభావం అవస్తువును సువాసనమయం చేసేది ఔతున్నది. రసజగత్తులో రసభావము ఒక గుణమైతే, సాంకేతిక భావం ఆ గుణాన్ని నిర్మించే ఓ కర్మ ఔతున్నది.

కళా జగత్తులో రసభావం నేత్రమైతే, సాంకేతిక భావం సుందర సృష్టి చేసే ఓ మధుర హస్తమౌతున్నది. ఇందులో ఏది తన పనిని మానుకున్నా కళాకృతి పరిపూర్ణతను పొందటానికి బదులు అపరిపూర్ణతనే పొందుతుంది.

లలిత కళా సృష్టిలో ఇవి రెండూ రెండు హస్తాలు. ఇందులో ఒకటి వామహస్తమై మరొకటి దక్షిణహస్తముకాక ఈ రెండూ సమస్థాయి కలవి ఔతున్నది. అంతేకాక ఇవి రెండూ రెండు నేత్రాలు రెండు హృదయాలూ గల హస్తాలై కళాసృష్టిలో కళానుభూతులను నిర్మిస్తున్నాయి.

కాకపోతే లలితకళా జగత్తులో మీమాంస ద్వారా రసభావం బాగా వ్యాప్తతను పొందితే, సాంకేతిక భావం తలవంచుకొని నిర్మాణం చేసే తత్వం ఔతున్నది. ఆ తత్వం వలన అది లలిత కళాజగత్తులో బాగా గుప్తతను పొందుతున్నది.

# తెలుగు భాగవతంలో ప్రతిబింబించే నవరాజవం - సంప్రదాయాలు

ఏ. మల్లికాదేవి

వ్యాసమహర్షి ప్రణీతమైన అష్టాదశ పురాణాలలో భాగవతము ప్రముఖమైనది. అది తెలుగుల పుణ్యపేటిక. పోతన చేతిలో పడి కావ్యస్వరూపాన్ని సంతరించుకొన్నది. ఆంధ్రమహాభాగవతం భక్తకోటులను భక్తికాసారంలోనూ, సరసులను రసకాసారంలోనూ తలమునకలుగా ఓలలాడించింది. పాండిత్య ప్రకర్షతోనూ, వివిధశాస్త్ర విజ్ఞానాంశాలతోనూ, హరికథామృత వచనములతోనూ కూడుకొని పండితుల విజ్ఞాన జిజ్ఞాసువుల, సామాన్య భక్త జనుల గుండెల్లో నిండిపోయింది. ఆంధ్రమహాభాగవతం అజరామరమైంది.

సంస్కృతంలోని భాగవతపురాణాన్ని పోతన, వెలిగందుల నారయ్య, వెర్చూరిసింగన అనే వారలు ఆంధ్రీకరించారనేది విజ్ఞులందరికీ తెలిసిన విషయమే. పోతన వీరభద్రవిజయము నారాయణ శతకము భోగినీ దండకము అనే రచనలు కూడా చేశాడనే విషయం మనందరికీ తెలిసిందే. అయినామన కెందుకో గాని పోతన అనగానే భాగవతం. భాగవతం అనగానే పోతన గుర్తుకు వస్తాడు. పోతన మహాభక్తుడు. భాగవతం వైష్ణవభక్తుల కథలతో నిండిన మహాకావ్యం, పోతన భాగవతంలోని ఆయా ఘట్టాలను. భక్తి పారవశ్యంతో పద్దించిన తీరు సహృదయహృదయైకవేద్యం అందుకే ఈ భావన.

వరంగల్ జిల్లాలోని బమ్మెర నివాసియైన పోతన వ్యవసాయం ముఖ్యవృత్తిగా జీవించే పేద రైతు. అయినా ఆ పంచానందదుర్విదితమైన తన మృదా మధుర కవితా చమత్కృతితో దాదాపు ఐదువందల సంవత్సరాలుగా ఆంధ్రుల గుండెల్లో గూడుకట్టుకొన్న కవిరాజు బమ్మెర పోతరాజు.

ఆంధ్రమహాభాగవతము ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న మహాప్రబంధము. అందుకు పోతన భక్తి పారవశ్యంతో గానం చేసిన భక్తుల గాథలు కారణమైనా, తెలుగునేల, తెలుగువాతావరణం, ఆనాటి మనపూర్వుల జీవిత విశేషాలు, వారి ఆచార వ్యవహారాలు సాంప్రదాయాలు నమ్మకాలు, క్రీడావినోదాలు, మొదలైన అంశాలన్నీ ఆ కావ్యంపట్ల మనకు గల గౌరవాదరాలను ఇనుమడింపజేస్తున్నాయి.

పోతన ఆర్థికంగా పేదవాడేమోగాని, కవిత్వతత్వ పటుత్వానికి, వ్యక్తిత్వానికి పేదవాడేమీ కాదు. ముముక్షువులైన వాళ్ళు చాలా మంది ముక్క-

మట్టెవాడ- వరంగల్ 506002

మూసుకొని తపస్సుచేసి మోక్షాన్ని పొందాలనుకొనే వాళ్లే, మన పురాసాహిత్యంలో ఎక్కువగా కనిపిస్తారు. పోతన కూడా మోక్షగామే. అయితే ఆయన మార్గం మాత్రం ముక్కు మూసుకొని తపస్సు చేయడం కాదు. సమాజంలో ప్రజల మధ్య జీవిస్తూ సమాజ ధర్మాలను పాటిస్తూ సహమానవులకు సహాయపడుతూ ధర్మార్థకామరూపమైన కైవల్యాన్నే ఆయన ఆకాంక్షించాడు. అందుకే భాగవతం మొదటి పద్యంలోని 'శ్రీకైవల్య పదంబు చేరుటకై చింతించెదన్...మహానందాంగనాడింభకున్' అని శ్రీకృష్ణుని ప్రార్థించాడు. శ్రీ అంటే త్రివర్గము ధర్మ, అర్థ, కామములు అని పెద్దలంటారు. (రాజన్నకవి—భాగవతతత్త్వము) వాటి ఆచరణ పూర్వకమైన కైవల్యాన్నే పోతన కోరుకున్నాడన్నమాట.

పోతన కాలంనాటికి కవులు రాజులనాశ్రయించి తమ కావ్యాలను వారికి అంకితమిచ్చి, వారిచ్చే ధనధాన్యాలతో ఆడంబరమైన జీవితాన్ని గడపడం పరిపాటిగా ఉండేది. శ్రీనాథాదుల జీవితచరిత్రలు దీనికి అద్దంపడుతున్నాయి. అయితే పోతన ఇటువంటి సంప్రదాయాలను నిరసించాడు.

బాలరసాలసాల నవపల్లవరాజిత కావ్య
కన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుట
కంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతరసీమల కంద
మూల కౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోష
ణార్థమై'

అనే పద్యంలో కవులు తమకావ్యకన్యకను రాజులకిచ్చే సంప్రదాయాన్ని పోతన తీవ్రంగా గర్హించాడు. పవిత్రమైన కవికర్మను (కావ్యాన్ని) భగవదంకితం చేయడమే సంభావ్యమని భావించాడు. పైపద్యంలోని 'నిజదారసుతోదర పోషణార్థమై' అనేది కూడా ఇక్కడ గమనార్హము. శ్రీకైవల్యపదంబు చేరుటకు......అనే భావానికిది ఉపబలకంగా ఉంది.

ఒక సందర్భంలో పోతన రాచకొండ సంస్థానం పోయాడట. అక్కడ నిండుకొలువులో శారదాంబ విగ్రహం ప్రతిష్ఠింపబడి ఉంది. కావ్యాలను రాజుల కంకితమిచ్చే సాంప్రదాయాన్నే వ్యతిరేకించే పోతనకు ఆశారదాంబ కన్నీరుపెడుతూ కనిపించిందట. ఆదృశ్యం చూచిన పోతన నిలువెల్ల నీరైపోయాడు.

'కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ
యేల ఏడ్చెదో
హాటక గర్భురాణి గాదిలి కోడల…

నిను నీ కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ! అని ఓదార్చాడట. ఈ ఐతిహ్యము వలన కూడ కవులు కావ్యాలను రాజులకంకిత మివ్వడమంటే, అమ్ముకోవడమే అని భావించిన పోతనగారి తీవ్ర వ్యతిరేకత ఈ క్రింది పద్యంలోను కనిపిస్తుంది.

'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు
వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని చొక్కి
శరీరము బాసి కాలుచే
సమ్మెట పోటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి
చెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు భాగవతంబు జగ
ద్ధితంబుగాన్ (1–11)

## మతపరిస్థితులు:—

పోతన కాలములో తెలుగుదేశమున,ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో శైవప్రాబల్యమధికంగా ఉన్నట్లు చారిత్రకులు భావిస్తున్నారు. పోతన తల్లి తండ్రులు శైవాగమపరులు. పోతన తండ్రిని గూర్చి భాగవత పీఠికలో ఈ విధంగా చెప్పుకున్నాడు.

'లలిత మూర్తి బహుకళానిధి కేసన
దాన మాన నీతి ధనుడు ఘనుడు
తనకు లక్కమాంబ ధర్మగేహినిగాగ
మనియె శైవ శాస్త్ర మహిమగనియె'

పోతన వీరభద్ర విజయము రచించుట కూడా అతని వంశము యొక్క శైవమతాభినివేశమును తెల్లము చేస్తున్నది పోతన ...

వేంయు శంభుమూర్తి వీరమహేశ్వరా
చార విభుడు భక్తి పారగుండు
అనఘుడివ్వటూరి యారాధ్య చంద్రుండు
సోమనాధసముడు సోమగురుడు'

అని తన గురువును పోతన ప్రశంసించాడు. పోతన భాగవత రచనా కాలము నాటికి తిక్కన భావించిన హరిహరాద్వైతమును భావించి భాగవత మును తెనిగించినట్లు పండితులూహించుచున్నారు.

'చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని'

అని పోతన వ్యాఖ్యానించడం శివకేశవాభేదాన్ని నిర్ద్వంద్వంగా నిరూపించడమే. ఈ విధంగా పోతన మహాభాగవతాన్ని మత సంయమనంతో సమన్వయ పూర్వకంగా తెనిగించడం నిజంగా తెలుగుజాతి చేసుకొన్న అదృష్టము.

తెలుగుసంస్కృతీపతాకవియైన పోతన తెలుగు వాతావరణాన్ని, తెలుగుజాతి సాంస్కృతిక విభవాన్ని భాగవతంలో సందర్భోచితంగా ప్రస్తావించాడు. మన సంప్రదాయాల్లో వివాహం ప్రముఖమైంది. వివాహబంధంతోనే స్త్రీ పురుషులు ఆలుమగలై కలిసిమెలసి సమాజంలో మనుగడసాగించేందుకు అర్హత సంపాదించుకుంటారు. అతి ముఖ్యమైన ఈ వివాహతంతును భాగవతం పదే పదే ప్రస్తావిస్తుంది.

వివాహానికి ముందు వధూవరులనలంకరించడం, వధువును భగవదాశీస్సులను కోరి, దేవాలయానికి పంపడం మనకు ఆనవాయితీగా వస్తున్న సంప్రదాయం. ఆనాడు తెలుగులోగిళ్లలో జరిగే ఈ వివాహ కార్యక్రమాలన్నీ మనము రుక్మిణీ కళ్యాణ ఘట్టంలో చూడవచ్చును.

తగిలి సఖులు గొల్వ తల్లులు బాంధవ
సఖులు తోడురాగ సవినయముగ
నగరు వెడలనడిచె నగజాతకును మ్రొక్క
బాల చికుర పిహిత ఫాల యగుచు

(10–1789)

అంతముత్తయిదువలగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి: గంధాక్షతలంబులిడి, వస్త్రమాల్యాది భూషణంబులనలంకరించి, ధూపదీపంబులొసంగి....రుక్మిణీ దేవిని మ్రొక్కించిన' (10–1740).

ఆమెయు'........హరింబతి సేయుమమ్మ నినునమ్మిన వారికెన్నటికి నాశములేదు గదమ్మ ఈశ్వరీ' (10–1741) అని ప్రార్థించింది తదనంతరం బ్రాహ్మణ ముత్తయిదువులకు మ్రొక్కి వారికి 'తాంబూల కంఠ సూత్రములు ఫలముల నిచ్చి పూజించడం, పుణ్యస్త్రీలు వధువు నాశీర్వదిం

చడం (10-1742, 1743) మొదలైన సంప్రదాయాలన్నీ ఆనాటి వైవాహిక తంతులో మాంగల్య ధారణకు ముందు జరిగేవి.

ఆనాటి సమాజంలో వివాహబంధం మంగళ సూత్రంతో ముడిపడుతుంది. మూడుముళ్ళు పడగానే స్త్రీ పురుషులు భార్యాభర్తలౌతారు. ఈ మంగళ సూత్రంతోనే స్త్రీ అయిదవతనాన్ని కూడా సంపాదించుకొంటుంది తాళిబొట్టు లేని స్త్రీ సమాజంలో విధవగా గుర్తించబడుతుంది. అందుకే ప్రతి భారత స్త్రీ తన మంగళసూత్రం పది కాలాల పాటు పదిలంగా ఉండాలని కోరుకొంటుంది. మన సంప్రదాయంలో ఇంత ఔన్నత్యాన్ని పొందిన మంగళసూత్రాన్ని పోతన భాగవతంలో పదేపదే ప్రస్తావిస్తాడు.

వామనమూర్తి బలిచక్రవర్తిని దీవిస్తూ- 'నిర్జరీగళన్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవ లోక 'భర్తకున్' (8-545) అని దీవిస్తాడు.

కాళీయమర్దన ఘట్టంలో-'ఏము బాసి వైధవ్యదుష్టాలంకారంబు పొందనోడెదము నాధాలాపమాలింపవే, బాలున్ నీపదతాడనంబు పరిభిక్షన్ బెట్టి రక్షింపవే' (10-684) అని కాళీయుని భార్యలు శ్రీకృష్ణుని వేడుకుంటారు.

క్షీరసాగరమథన ఘట్టంలో లోకహితార్థంబు పార్వతి శివుని గరళము మ్రింగమన్నది.

'మ్రింగెడువాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వ మంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మినదో

అని శుకమహర్షి ఆశ్చర్యపోయాడని పోతన వర్ణించాడు.

శ్రీరాముడు చేసిన దానధర్మాలను వర్ణిస్తూ
'తనకు రెండు పుట్టంబులు తనకనైన
మెలత మంగళ సూత్రంబు మినహ దక్క
వినతుడై యుండె నారాము వితరణంబు
పొందవోత్తమ యేమని పలుకవచ్చు'

అని పోతన సమాజంలో భార్యాభర్తల అనుబంధానికి, స్త్రీ అయిదవతనానికి గుర్తింపయిన తాళిబొట్టు ప్రాశస్త్యాన్ని పదేపదే వర్ణించాడు.

వివాహాల్లో కట్నకానుకలు సమర్పించడం మనకు అనుస్యూతంగా వస్తున్న ఆచారం. నగ్నజిత్తు కుమార్తె కృష్ణుడు వివాహమాడిన తరుణంలో నగ్నజిత్తు అరణంగా ఆభరణాలు, రథాలు, ఏనుగులు, గుర్రాలు మొదలైన వానిని శతాధికంగా ఇచ్చి పంపాడు. అదే విధంగా సుభద్రార్జునుల వివాహసమయంలో బలరాముడు

కరులన్ దేరులనుత్తమ
హరులన్ మణిహేమ భూషణాంబర భృత్యోత్కర దాసీగా జనంబుల
నరణము దగనిచ్చి పంపె ననుజకు ప్రీతిన్

(10-1191) ఇవి ఆ రోజుల్లో రాజసంస్థానాల్లో వివాహ సందర్భాల్లో జరిగే సంప్రదాయాలు. ఇటువంటి కట్నకానుకలు మామూలు కుటుంబాల్లో కూడా ఏదో ఒక రూపంలో ఉండి ఉంటాయని మనమూహించవచ్చు. పిల్లల అమ్మాయిలకన్న సామాన్య కుటుంబీకులువడే అవస్థలు కూడా పోతన గమనించి ఉంటాడు. సహజ శ్రేయస్కరముగాని ఇటువంటి సంప్రదాయాలను సహజంగా తిరస్కరించే పోతన కృష్ణుని ద్వారా'......సౌజన్యకాంక్ష జనుదెంచితి నీ కన్యన్ వేడెదనిమ్మా కన్యా

శుల్కాదు : మేముగాము నరేంద్రా' అని అడిగించాడు.

వివాహాది శుభ సందర్భాల్లో ఆడపడుచులకు చీరలు సారెలు పెట్టడం కూడా మన సంప్రదాయాల్లో ఒక భాగమే. దేవకీ వసుదేవుల వివాహ ఘట్టంలో వివాహానంతరం శూరసేనుడు కట్నకానుక లిచ్చి కూతురును సాగనంపుతుండగా అశరీరవాణి దేవకీ అష్టమగర్భస శిశువు నిను హరించుసుమీ' అని కంసుని హెచ్చరించింది. అది విని కంసుడు దేవకిని సంహరించబూనుకొన్నాడు. ఈసందర్భంగా అన్నవునీవు చెల్లెకి నక్కట మాడలు చీరలిచ్చుచో మన్ననసేయుటో మధురమంజుల భాషల నాదరించుటో' (10పూ—భా-26) అని సోదరిని చంపనుంకించిన కంసుని, వసుదేవుడు వేడుకొనుటలో మనం మన తోబుట్టువుల నాదరించే సంస్కృతి కనపిస్తుంది.

పెండ్లిళ్ళల్లో అప్పగింతలు చివరిఘట్టము. అల్లారుముద్దుగా పెంచుకొన్న అమ్మాయిని వివాహానంతరం అత్తవారింటికి సాగనంపడమే అప్పగింతల కార్యక్రమము. వివాహ వేడుకల్లో సామాన్యంగా అన్ని కార్యక్రమాలు చాలా ఉత్సాహంగా జరిగిపోతుంటాయి. అయితే అప్పగింతల సన్నివేశం మాత్రం ఒక భారమైన అనుభవం. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రు స్నేహితులు, బంధువులు బరువెక్కిన హృదయాలతో, అర్ద్రనయనాలతో అమ్మాయిని అత్తవారింటికి పంపే సన్నివేశం కరుణ రసప్లావితమై మన కన్నెదుట నిలుస్తుంది. భాగవతంలో పోతన అతిసున్నితమైన ఈ సన్నివేశాలను కరుణ రసాత్మకంగా చిత్రీకరించాడు.

శతరూపా స్వాయ భువుల గారాలదుహిత దేవహూతిని కర్దమునికిచ్చి వివాహం చేశారు. వివాహానంతరం అప్పగింతల సమయంలో స్వాయంభువు 'దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతుండై, కూతుం కౌగిలించుకొని, చుబుకంబు పుణుకుచు చెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేకంబున బాష్ప ధారాసిక్తము స్తకంజేసి, తల్లీ! పోయివచ్చెనని చెప్పి, కర్దముని చేత ఆమంత్రితుండై నిజభార్యాసమేతముగా' ఇంటికి వెళ్ళాడు.

(3–785)

ఆటపాటలు, క్రీడా వినోదాలు శరీరదార్ఢ్యానికేగాక మానసిక వికాసానికి కూడా దోహదం చేస్తుంటాయి. అందుకే ఇవి ఏ జాతి జీవన విధానంలోనైనా ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నాయి.

భాగవతంలో పోతన మన దేశీయ క్రీడలను కొన్నిటిని సందర్భోచితంగా వర్ణించాడు. రుక్మిణీదేవి శైశవదశలో ఆడుకున్న బాలికా క్రీడలు

॥సీ॥ వీర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబులందు
గుజ్జనగూళ్ళను కొమరొప్ప వండించి
చెలులకు పెట్టించు చెలువుమెరయ
రమణీయ మందిరారామ దేశంబుల
పువ్వు తీగలకు ప్రోదిసేయు
సదమల మణిమయ సౌధ భాగంబుల
లీలతో భర్మ డోలికలనూగు
॥తే॥ బాలికలతోడ చెలరేగి బంతులాడు
శారికా కీరపంక్తికి చదువుచెప్పు
అబ్జసంభవములకు మురిపములు గరపు
మద మరాళంబులకు జూపు మందగతులు

(10–ఉ. భా–1687),

ఈ పద్యంలో పోతన చెప్పిన క్రీడావినోదాల రాకుమారి రుక్మిణిపరంగా ఉన్నా, చిలుకలకు చదువుచెప్పడం, మరాళాలకు మందగతులు నేర్పడం, మయూరాలకు మురిపములు గరపడం వంటివి మినహాస్తే మిగిలిన బొమ్మల పెళ్ళిళ్ళు ఊయలలూగడం, బంతులాడడం మొదలైనవన్నీ బాలికలందరూ ఆడుకునే ఆటలు,

శ్రీకృష్ణుని బాల్యక్రీడలను వర్ణిస్తూ పోతన కృష్ణుడు తన స్నేహితులతో కలిసి చద్దియన్నము నారగించిన విధానాన్ని—

సీ॥ 'మాటిమాటికి వ్రేలు మడచి యూరించుచు
యూరగాయలు దినుచుండునొక్క-
డొక్కని కంచములోని దొడిపిచయ్యన మ్రింగి
చూడలేదని నోరుచూపునొక్కరు
తే॥ కృష్ణుచూడు చునుచు గికురించి
పరుమ్రోలి మేలి భక్ష్యకాళి మెసగునొకడు
(10.పూ. భా. 495)

సీ॥ పెరుగు పెరుగుతో మేళవించిన చల్దిముద్ద
కావలిచేత మొనయనునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ళసందులను దా వెలయనిరికి
ఆ॥ సంగడీలనడుమ జక్కన గూర్చుండి
నర్మ భాషణముల నగవునెరపి
యాగభోక్త కృష్ణుడమరులు వెరగంద
శైశవంబు మెరసి చల్దిగుడిచె
(10.పూ.భా.496)

అని సహజంగా వర్ణించాడు.

సౌందర్య ప్రియులుగా ఉండే నాటి సంపన్న స్త్రీలు మేలి పుట్టములు కట్టి, మైలేపనములనలంది, అద్దంలో చూచుకొని బొట్టుదిద్దుకొని, చక్కగా అలంకరించుకొనే వాళ్ళు (10 పూ.భా. 246) పురుషులు కూడా రకరకాల మైలేపనాలను వాడే వారు. రంగురంగుల వస్త్రాభరణాలను ధరించే వారు. కొరసిగలకు పూలమాలలు చుట్టుకొనే వాళ్ళు శృంగార పురుషులకు ధమ్మిల్లము, కొరమీసము, సౌందర్య పోషకాలుగా ఉండేవి (10 పూ. భా 496).

'బలరాముడు తీర్థయాత్రలకు బయలుదేరి సేవించిన పుణ్యక్షేత్రాల్లో, నదీనదాల్లో, శ్రీశైలము, వేంకటాచలం. సప్తగోదావరులు, కృష్ణ, పెన్న మొదలైనవి వర్ణింపబడ్డాయి (10–946, 947).

మన సంప్రదాయాల్లో బాల్యవివాహాలు కూడా ఉన్నాయి. స్త్రీ పురుషులు ఒకరినొకరు అర్థం చేసుకొనే స్థితికి ఎదిగిన తర్వాత, జీవితం పట్ల వారికొక అవగాహన ఏర్పడిన పిదప పెండ్లి చేయడం మంచిదనే అభిప్రాయం నాగరిక ప్రపంచంలో సర్వత్రా ఆమోదము పొందినది. ఏమి తెలియని మనసు, ఎదిగీ ఎదగని వయసులో చేసే బాల్యవివాహాలు అనర్థాలకు దారి తీస్తాయి ఈ విషయాన్ని ఏనాడో గమనించిన పోతన ఆ సంప్రదాయాన్ని గర్హిస్తూ "పిన్నానాటి పెండ్లి పెండ్లి గాదు" (10–686) అని హెచ్చరించాడు.

రాజాస్థానాల్లోను, ప్రభుత్వకార్యాలయాల్లోను తమ కార్యాలను నెరవేర్చుకొనేందుకు ఆయా స్థాయిల్లో ఏదైనా యిచ్చే అలవాటు ఆరోజుల్లో ఉండేది. దానికి పోతన వాడిన పదం 'పరిదానం' శ్రీకృష్ణ దర్శనార్థమై వచ్చిన కుచేలుడు ద్వారకా నగరంలో ప్రవేశించిటప్పుడు

"ద్వారపాలురెక్కడి విప్రుండు నిందేల
వచ్చెదవని యడ్డుపెట్టిరేని వారికేమైన
పరిదాన మిచ్చి చొచ్చెదనన్న
యూహింప అర్థశూన్యుడనేను"

(10–992) అని అనుకుంటాడు.

కంసుని ఆదేశానుసారం అక్రూరుడు బల రామకృష్ణులను మధురకు తీసుకొని వస్తాడు. అక్రూరుడు మధురలో తన ఇంటికి రమ్మని ప్రార్థించినా పోని కృష్ణుడు సుదాముని ఇంటికి పిలవకుండానే పోతాడు. సుదాముని సపర్యలందుకొని వరం కోరుకోమంటాడు సుదాముడిలా కోరుకున్నాడు.

'కం' నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నింతా
త పార భూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే
(10–1268)

మాధవసేవ, మానవుపట్ల స్నేహ వాత్సల్యాలు, అంతములేని, పారము నెరుగని జీవకారుణ్యాన్ని ప్రసాదించవలసిందిగా కోరుకున్నాడు సుదాముడు. ఈ విధంగా సుదాముని ద్వారా జీవకారుణ్య సందేశాన్ని ప్రబోధించాడు పోతన.

సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించే భాగవతాన్ని ఈ విధంగా పరిశీలిస్తూ పోతే ఆనాటి మనపూర్వుల జీవిత విధానము, వారి ఆచారవ్యవహారాలు, సంప్రదాయాలు, క్రీడావినోదాలు, వేషభూషణాదులు, ఆహారవిహారాలు మొదలైన అనాటి సాంఘిక విశేషాలు మన ముందు సాక్షాత్కరిస్తుంటాయి.

# ఈ శతాబ్ది ప్రారంభంలో వెలసిన రెండు గొప్పనాటకాలు

వొద్దిరాజు వెంకటరామారావు

'మదీయ వాగ్దేవతా పూజకో ఆవాహనము శ్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము 'ఆసన సమర్పణం' కథా సరిత్సాగరం' అర్ఘ్యము 'ప్రతాపరుద్రీయ నాటకం', పాద్యము 'మేఘ సందేశాంధ్ర టీక, అలంకారం 'ఆంధ్ర ప్రసన్న రాఘవ నాటకం' విమర్శ–'కింకిణీ గణ శింజాన శారదా కాంచిక' నైవేద్యం 'శృంగార నైషధ వ్యాఖ్యాన సర్వంకష' తాంబూలం 'సాహిత్య దర్పణం' నమస్కారము 'ఆముక్తమాల్యద'.

ఈ పూజాభాగ్యము కీ॥ శే॥ వేదం వేంకటరాయశాస్త్రిగారికి దక్కుతుంది. క్రీ॥ శ॥ 1883 నుండి క్రీ॥ శ॥ 1921 వరకు మధ్యకాలములో శాస్త్రిగారు తాను సృజియించిన సారస్వతమును గురించి పై విధంగా తెలుపుకొన్నారు.

తెలుగు రూపక వాఙ్మయ చరిత్రలో 1893–97 మధ్యకాలము బహుముఖ్యమైనది. ఈ కాలముననే రెండు గొప్ప నాటకములు వెలువడినవి. నాటకాంతం హి సాహిత్యమ్', 'కావ్యేషు నాటకమ్ రమ్యమ్' అను సూనృత వాక్యాలకు సార్థకతను చేకూర్చునట్లుగా నిలిచినవి. ఆంధ్ర భాషాయోషిత కంఠహారమున రత్నములై ప్రకాశించినవి.

అవి 'కన్యాశుల్కం' 'ప్రతాపరుద్రీయం'.

సామాజిక ప్రయోజనం కోసం, సృజనాత్మకంగా వినిర్మింపబడి ప్రపంచనాటక సాహిత్యంలోనే ప్రముఖనాటకాలుగా చెప్పుకొనబడినవి.

ఈ నాటకములు రెండూ ఇంచుమించు ఏక కాలంలో (193–95) వెలువడ్డాయి. ఈ రెంటిటిపై వ్యవహారిక భాషోద్యమ ప్రభావమున్నది. కన్యాశుల్కమనే సాంఘిక దురాచారాన్ని నిరసించి బాల్య వివాహాలను గర్హించిన గురజాడ క్రొత్త దారులు త్రొక్కి వ్యావహారిక భాషలో 'కన్యాశుల్కాన్ని' రచించారు. జాతి సమగ్రతకు ముప్పు వాటిల్లినపుడు, సంస్కృతిని కాపాడుకొంటూనే దేశ సమైక్యతకు భారతీయులెలా నిలుస్తారు, 'సర్వేజనాః సుఖినోభవస్తు' అను ఉపనిషద్వాక్యాలు ఎలా అనుసరణీయమో, సంప్రదాయ పద్ధతిలో పాత్రోచిత భాషా ప్రయోగంతో వినిర్మింపబడినది 'ప్రతాపరుద్రీయం."

వేదం వారికి మాత్రం 'పాత్రోచిత భాషా ప్రయోగి' అనే విశేషణం ఇచ్చి ఊరుకొన్నారు. సాహిత్యానుశీలన సద్విమర్శకులు. 'గురజాడ' ను వందసంవత్సరాలుగా, ఆకాశంలోకి ఎత్తేసూనే

వరంగల్–506 009.

వున్నారు శతజయంత్యుత్సవాలు జరుపుకొంటు న్నారు అభిమానులు. పరిశోధనలు చేస్తూ కొత్త తత్వాలను కనుగొనుచున్నారు. ఈ శతాబ్ది ప్రారంభంలో వెలసిన ఈ రెండు మహానాటకము లలో మూల స్వభావాన్ని ఎరుగక కేవలం కల్పిత మైన చారిత్రిక గాథగా చిత్రించబడింది. కల్పిత మైన 'మధురవాణి' జనసామాన్యం హృదయాలలో తిష్ఠ వేసింది. ఆ పాత్రే అలాంటిది. అందర్నీ ఆకట్టుకొంటుంది' కదా! ....అయితే ఇతివృత్త శాశ్వతత్వము పొందుటలో 'ప్రతాపరుద్రీయమే. అగ్రస్థానము పొందుచున్నది.

'కన్యాశుల్కము'లోని వస్తువు సార్వకాలీన మైనదికాదు. స్త్రీ జనాభా తక్కువవున్న తరుణంలో పెళ్ళిళ్ళకై ఆడపిల్లలను కొనుక్కొనే దురాచారాన్ని వేశ్యాలంపటత్వాన్ని వ్యవస్థలో వున్న కొన్ని లోపాలను వ్యంగ్యంగా ఎత్తిచూపుతూ, ఒకానొక ప్రాంతపు మాండలిక భాషలో వ్రాయ బడింది. నేడు ఆడపిల్లలు మగపిల్లల్ని కట్టు కొంటున్నారు 'కట్నం'తో కనుక. కన్యాశుల్కం సమస్యే లేదు. వితంతువులకు పునర్వివాహాలు జరుగు చున్నాయి. వేశ్యా'వృత్తి' లీగలైజు చేసే అవ కాశాలున్న రోజులివి. కాబట్టి Notchy-Anti notchy ప్రశ్నే లేదు. మధురవాణిలోని 'మంచిని గిరీశంలోని 'గురువు'ను ఎవరు చూస్తారీ కాలంలో. అన్నిపాత్రలు అరిషడ్వర్గాలలో ఏదో ఒకదానికి బానిసలైనవే. హాస్యరసమైన నాటకమని వ్యాఖ్యానా లున్నవి. కానీ తరచి చూస్తే 'విషాదాంత బీభత్స రస ప్రధాన మీ నాటకమని' మహాకవి శ్రీశ్రీ సమీక్షించాడు.

ప్రతాపరుద్రీయం వీరరస ప్రధానమైనది. మనప్రాచీన వాఙ్మయంలోనైతేనేమి, అర్వాచీనంలో నైతేనేమి 'వీరగాథ'లు కోకొల్లలు. 'అభిమన్యుడు', 'బాలచంద్రుడు' మొదలగువారు ఆంధ్ర సాహిత్యంలో సజీవులే. రసప్రధానమైన చర్చ కాదు. ఇతివృత్తంలోగల సార్వజనీత ముఖ్యం. మానవ స్వభావాలు మారవచ్చు. సంస్కృతిలో మార్పురావచ్చు. మాతృభూమిపై మమకార మెన్నడికీ మరచిపోకపోవడమే సార్వజనీనత సాధించే లక్షణాలలో నొకటి

కన్యాశుల్కం నాటకం రెండవ ముద్రణలో గురజాడవారే' *The credit of deliberately introducing the vernacular into telugu drama in keeping with sanskrit tradition belongs to my friend V Venkat ray shastry garu whose Prataparudreeyam owes not a little of its charm to dialogue in the dialects''* అని శాస్త్రి గారిని ప్రశంసించారు. ఈ రెండు నాటకాలలో తెలుగు దనము మూర్తీభవించి ఉన్నది. కన్యాశుల్కంలో అంతా వ్యావహారిక భాషలో సాగిపోతుంది. సమాజంలో ఒకవర్గం(బ్రాహ్మణులు) వారి భాష ఎక్కువగా వుపయోగించబడింది. ఇరువురు నాటకకర్తలూ పాత్రోచిత భాషావాదులే. గురజాడ వారు శుద్ధవ్యావహారిక వాదియై నాటకాన్ని నడిపారు. వేదం వారు రసస్ఫూర్తికై గీర్వాణ వాణి మర్యాదను పాత్రోచిత భాషను నెలకొల్పువారై నీచపాత్రులకు (చాకలిపేరిగాడు) గ్రామ్యము ప్రయోగించిరి. కన్యాశుల్కంలోని భాషతో, ఆంగ్ల భాషా పరిజ్ఞానమున్న పాఠకులే ఎక్కువ ఆనందం పొందుతారు.

విద్యానాథుడు సంస్కృత పండితుడు. 'ఉద్యోద్దోస్సమ్ము ఖడ్గత్రుటదరిమ కుటాటోప సంఘాతరాహుత్రాన్ని భ్రశ్యత్పత్రజ్ఞా భయరణ చణ స్పార నాసీర రేణు' అని ఓజోభూయిష్టమైన దీర్ఘ

సమాసంద్వారా ప్రతాపరుద్రుని పరా క్రమాన్ని, తన ప్రతిజ్ఞను చెప్పిస్తాడు.

సాస్తుల్లుభాయ్ వలీఖాన్ యెక్డా వుండేది.... మాకీ చెప్పండి' అని ఖుస్రూ పాత్ర ద్వారా మిశ్రిత భాష మిళితమైన తెలుగును ప్రయోగించుట, స్వాభా వికంగా వున్నది అలాగే పేరిగాడు ప్రతాప రుద్రునిగా సభలో నున్నపుడు కవుంతో నటీనట గాయకులతో భాషించిన తీరు సహజంగా పాత్రో చితంగా వున్నది. వెఱ్ఱివాని వేషంలో ఢిల్లీ వీధుల్లో యౌగంధరాయణ మంత్రి పలికిన పలుకులు ఉన్మత్త ప్రేలాపనలే అయినప్పటికీ సర్మగర్భిత మైనవై, శిష్యులకు చేయబోయే కర్తవ్యాన్ని తెలుపు తాయి. 'లాటికాయ సీటికాడ నాటికాడనాటినారయా', అని ఖుస్రూ ఖాన్ వలీఖాన్ తలనరికి యమునలో పారవేసిన సమాచారం అన్యాపదేశంగా తెలియ జేస్తాడు. కన్యాశుల్కం చదువుతుంటే, సంఘటనలు నిలిచి కళ్ళముందుటాయి. కాని ప్రతాపరుద్రీయం చదువుతుంటే మనమూ ఒక పాత్రలో కలిసి పోతాము.

కన్యాశుల్కములోని ఇతివృత్తానికి శాశ్వ తత్వము లేదు. ప్రతినాయకుల పాత్ర ఎక్కువ అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాన్లు, రామప్ప పంతులు, గిరీశం, తమ స్వార్థం కోసం నాటకాన్ని నడిపిస్తారు. ధనాశ స్త్రీ వ్యామోహం ఎక్కువ. కరటకశాస్త్రి కూడ నాటకాసమాజాల్లో తిరిగి స్త్రీ-ంచే ఇష్టడవుతాడు—గిరీశంతో 'డామిట్ కథ అడ్డం తిరిగింది' అనేమాటను చెప్పించి, ముగి స్తాడు గిరీశాన్ని సంస్కరించే ప్రయత్నం చేయక, సమాజం పైకి వదిలాడు. అందుకే నేటి విద్యా వ్యవస్థలో గిరీశమహోపాధ్యాయులు 'కాపర్స్' కోసం కమ్మర్షియల్‌గా కోచింగ్ సెంటర్లు పెడుతున్నారు. సౌజన్యరావు వంటి వారి దగ్గరనుండి భగవద్గీత అందుకొంటూనే 'మధురవాణి' వంటి వారు 'చెడిపోయిన వారికి' చేరదీస్తున్నారు.

ప్రతాపరుద్రీయంలో చరిత్రకు దొరకని యౌగంధ రాయణుడున్నాడు. 'అతడు గాలిని పేనును. తోయముతో నరుకును. పొగలతో గోడ లిడును' (ప్రథమ అంకము) అని విశ్వానరావు, 'అతనిపేరు' వింటే గుర్రం నీరు తాగదని, ఏనుగులు నిద్రపోవని' వలీఖాన్ వర్ణిస్తాడు. ఈ పాత్ర కల్పితమైనదైనను చరిత్రలో సజీవపాత్ర యైనది. కథా పరంగా—వరంగల్ చక్రవర్తి ప్రతాపరుద్ర మహారాజును ఢిల్లీ సేనాని వలీఖాన్ మోసముచేసి బంధించి తీసికొని పోగా మంత్రియు గంధరుడు మఱల ఎత్తుకు పై ఎత్తువేసి రాజును విడిపించుకొంటాడు.' ఇదే యితివృత్తము.

అంతటి పరాక్రమ వంతుడైన రాజు ఎలా బంధింపబడతాడు?— విధిబలీయమనే విషయాన్ని కవి నిరూపిస్తాడు. 'చింతిల నేమిగల్లు విధి చేత బలీయము'' (తృతీయాంకం) అని రాజు చేత విద్యానాథుని చేత వేర్వేరు సందర్భాలలో పలికి స్తాడు. గొదారిగట్టున మాకైపీరెందుకు (పడువ నడిపేవారు) చావనలె'' అని రాజు స్వగతంలో అనుకొంటాడు—ఆంధ్రుల దేశభక్తి, రాజు ప్ర జాహితైక తత్పరత కానవస్తాయి ఈ సందర్భమున

'కానిపోయెనమ్మా నీపట్టని యవమదు దైవ
ఘటన ఢిల్లీపురికిన్
వనరకు మేషునెలల వది దినములలోఁ దెచ్చి
యిత్తు దేవీ నీకున్'

అని హామీ ఇస్తాడు. యుగంధరుడు. యాత్రలతో ఉన్నపుడు రాజు బందీ కృతుడౌతాడు. ఇదే విషయాన్ని.

'మంచిది! నేను లేనప్పుడు గదా. వీడు పట్టిరాడు! హా నారాజును వీడా హరించువాడు!' అని.

'పాతాళంబందుగానీ ప్రళయపవన గర్భంబు నందైనగానీ
శ్రోతుర్గత నృమహీశు స్ఫురకలు బలవద్దుష్ట దైవాపచేష్టన్
....ఢిల్లీపు రణన్గురవమెకలన్ ఖైదీగా(గట్టి తెత్తున్'

ప్రతిజ్ఞ చేస్తాడు. తురకలు రాజును బంధించుట దుష్టవిధియొక్క దుశ్చేష్టచేతగానే ఈ సందర్భంలో తెలియజేస్తాడు. శీలపోషణకు పాత్రల సంభాషణకును, కథాసన్నివేశ కల్పనకును చక్కని సమన్వయము కుదిరిన ఇటువంటి నాటకము తెలుగు భాషలో ఎక్కడ లేదు. కన్యాశుల్కంలో కథ కంటె కథనం బాగుంది. అయితే కథనంతోబాటు సన్నివేశ కల్పనలలో కూడా ప్రతాపరుద్రీయం ముందుంది.

పాత్ర నిర్మాణపరంగా కన్యాశుల్కంలోని 'మధురవాణి' 'మంత్రి' వంటిది. ఎంతో చాతచక్యంతో యుక్తిగా కథను ఓకొలిక్కి తెస్తుంది. ఈమె పాత్రలో జాణతనమున్నను ఉదాత్తమైనది గానే తీర్చిదిద్దబడింది కాని వధహారుకళం చంద్రునిలో మచ్చ వున్నట్లు 96 పైసల ఈ తెలుగు అమ్మాయిలో 'నాలుగుపైసల లోప మున్నది. మధురవాణి, సౌజన్యరావు పంతుళ్లను మినహాయిస్తే మిగతా పాత్రలన్నీ అమావాస్య చంద్రులే!

'వేశ్య మొఖమే చూడను' అనుకొనే సౌజన్య రావు పంతులు మనస్సులో తన 'నిగ్రహం'పై విశ్వాసం లేని బలహీనతున్నదేమో! మనస్తత్వ పరిశీలకులకు వదిలేద్దాం గిరీశం ప్రతినాయకుడే. లుబ్ధావధాన్లులో మోహం, లోభత్వం,' రామప్ప పంతులలో మోహ మద మాత్సర్యాలు, అగ్నిహోత్రావధాన్లులో అహంకారం మూర్ఖత్వము కనబడతాయి...గిరీశం హీరో వలె డైలాగులు చెప్తూ పూటకూళ్ళమ్మ మధురవాణి' బుచ్చమ్మలతో సంబంధాలను ఆశిస్తాడు. గిరీశం మాటలలో 'హ్యూము'రసమేగాని ఆలోచనల్లో హ్యూమనిజమున్నదా? అయినా గిరీశాన్ని చూచే వారికి, కోపం జనించదు సరికదా నవ్వొపుట్టుతుంది. అదేదో అగ్నిహోత్రావధానుల ఇంటి సమస్య, అలాంటి వారికి గిరీశమే వక్కా' అని అనుకొని మురిసిపోతుంటాం:

పాత్రల్లో పోలికలు తేవడం ముఖ్యం కాక పోయినా, కథనంలో పోలికలు కనిపిస్తాయి. 'మారువేషంలో' సుబ్బి 'కన్యాశుల్కం' కథకు కీలకమైనట్లే రాజుగారి రూపంలో చాకలిపేరిగాడు, వెఱ్ఱివాని రూపంలో యుగంధరుడు ప్రతాపరుద్రీయం కథకు, కీలకమైనవారు —

వచ్చీరాని చదువుతో గప్పాలు కొట్టి గిరీశం పాత్ర కల్మషమైనది. కాని పేరిగాని పాత్ర నిష్కల్మషమైనది. చదువుకొన్నవానికన్న తానేనయమని (షష్ఠమాంకము—పేజి 68) భావము చతుర్థాంకములో అమాయకత్వాన్ని షష్ఠమాంకములో గడసరితనాన్ని దశమాంకములో నిజాయితీని చూపించే ఈ పాత్ర ప్రగాఢ ముద్ర కలిగి ఉన్నది. పేరిగాడిలో ప్రతాపరుద్రుని పోలికలు అచ్చుగుద్దినట్లుండడం అనూహ్య కల్పన. ఈ కల్పన వలన సుల్తాన్ సైన్యం అసలు రాజును కొనిపోలేదు పేరిగాణ్ణి కొనిపోయారన్న భ్రమకు లోనవుతారు. కన్యాశుల్కంలో లుబ్ధావధానులు కూడా భ్రమకులోనై సుబ్బి''ని పెళ్ళి చేసుకొంటాడు. ఇక యుగంధరుని పాత్ర తర్వాత చెప్పదగిన పాత్ర విద్యానాథునిది. ఇతను ఆస్థా

విద్వాంసుడు. తనయుక్తితో సిపాయిల పన్నాగాన్ని గ్రహించి, మంత్రికి తెలియజెప్పి; జ్యోతిష్యునిగా బొకలిపేరిగాణ్ని రాజుగా ఉండుటకు ఒప్పించి, నాటకంలో ప్రముఖస్థానాన్ని పొందాడు అలాగే జనార్ధనమంత్రి, విశ్వాసరావు, చెకుముకిశాస్త్రు భేతాళరావు మొ|| పాత్రలలో రాజభక్తి దేశాభిమానము కానవస్తాయి.

ప్రతాపరుద్రీయం నాటకీయ మర్యాదలు కలిగి వున్నది. నాందీ ప్రస్తావనలు భారతీయ రూపక మర్యాదననుసరించి కావింపబడినవి. ద్వితీయ తృతీయాంకములందు మధ్య ప్రవేశకము కూర్చబడినది. నాటకకథ పంచసంధులు నుండుటకు అనుకూలంగా కూర్చబడినది.విద్యానాథ వృత్తాంతం ప్రాసంగికముగా నెంచవచ్చును. ఫలభోక్త రాజు కావున ప్రతాపరుద్రుని నాయకునిగా నెంచవచ్చును. నాటకమందున్న అంకములు పది. మొత్తం కథ సంవత్సర కాలమును మించలేదు. నాటకము మోదాంతము. నాటకీయ మర్యాదలు సంప్రదాయమైనవి కనుక గురజాడ వారికివి ఇష్టంలేవు విశ్వనాథ, టి. యస్ ఇలియట్ వంటి సంప్రదాయ వాదులను ఉద్దేశంలో పెట్టుకొనే 'ఆఫీనుగలు మనలాగే ఏడుస్తూ ఉండే వారు మనకంటే అధ్వాన్నంగా ఉండేవారు' అని పంతులు గారు అన సాహసించారు. (కన్యాశుల్కం—xit) అని పీఠికలో శ్రీ శ్రీ పేర్కొన్నారు.

'కన్యాశుల్కం'లో గిరీశంపాత్ర సాయంకాలం ప్రవేశిస్తుంది.(ప్రథమాంకము) చివరికి రాత్రి 'డామిట్ కథఅడ్డం తిరిగింది' అని నిష్క్రమిసుంది. నాటకంలో విషాదం హాస్యం, శృంగారం సమాంతరంగా విస్తరించాయి. ఫలభోక్త ఎవరో తెలియదు. బుచ్చమ్మకు పునర్వివాహమవుతుందా? మధురవాణి వేశ్యావృత్తిని పరిత్యజించిందా? గిరీశంలో రిఫార్మ వచ్చిందా? అన్న ప్రశ్నలకు మిగతా కథను వెండితెరపై చూడండి అన్నట్లుగానే మహాకవి మనకు వదిలేశాడు

కవిప్రతిభను చూసినట్లైతే వేదంవారు గురజాడవారు ఇద్దరూ అద్వితీయ ప్రతిభాసం పన్నులే. సమకాలీన వర్గాల వారిపై వ్యంగ్యంగా పాత్రలను సృష్టించారు. అస్తవ్యస్థంగా ఉన్న విద్యావ్యవస్థను, న్యాయస్థానాల్లో పెండింగ్ కేసులను మూఢాచారాలను ఎత్తిచూపించారు. కన్యాశుల్కంలో కవి కవిత్వ ప్రతిభ గిరీశం ద్వారా అక్కడక్కడ కనబడుతుంది.

'పుల్లుమూను లైటటా
జాసుమిన్ను వైటటా' (కన్యాశుల్కం'పేజీ27)
*She leaves her bed at Am four*
*and sweeps the dust from the flour*
(కన్యాశుల్కం57)

'కాముని విరిశరముం బారికి వేనేమని
సహింతువే'... (కన్యాశుల్కంపేజీ81)
'భగవతి అమృతము తేగా భుగభుగమని'పొంగి

ఇవన్నీ స్వగతంలో చెప్పుకొనే కవితలు.... వీనిలో సంప్రదాయ ముద్రలూ ఉన్నాయనుకోండి!

ప్రతాపరుద్రీయమందు కవిత్వమపారము. పదవవారి జానపద గేయాలు, విద్యానాథుని సంస్కృత శ్లోకాలు, పేరిగాడు చదివిన చాటువులు వెఱ్ఱివాని వేషములో యుగంధరుడు చదివిన గేయాలు శాస్త్రిగారి ప్రతిభకు నిదర్శనాలు. ఈ కవిత్వాన్ని కూడా పాత్రోచితంగా, సందర్భోచితంగా చొప్పించాడు. తురకల పై చదివిన ('సాహెబనకు చంద్రుడు మషాలు' ముందు ఫిరోజ

ముస్తఫ సముత్త' పద్యాలలో ఉర్దూ ఛాయలుండటం గమనించదగ్గది. 'పీరయుగంధర్ పేరు చెప్పితే నీరు పియడు ఘోడా' అని వలీఖాన్ 'సబురు ఖర్చునజర్ల కువెల' అని వర్తకులు 'సీరం షారాయి నారంలా ఘంటాయి జూరనిషారేని పేరిమియా' అని సిపాయింతో పలికిస్తాడు నాటక ప్రారంభంలో 'నీటను డాగి కొండ తాలి నెక్కొని.. నేలెతన్' అని దశావతారస్తుతిని అచ్చతెనుగులో వ్రాశాడు.—ఆ కాలంలో శాస్త్రిగారిని అనేకులు విమర్శించి, 'గ్రామ్యశాస్త్రి' అని అన్నారట. అలాంటి వారిని దృష్టిలోనుంచుకొని 'పీరజీన్న రాగజీన్నమన్న తీస్తాయిన్' అని అన్నాడేమో. నాంది ప్రస్తావనలో—

'జంకు కళంకు లెని కవిచంద్రుడు తోషిత కోవిదేంద్రుడా వేంకటరాయ శాస్త్రి కృతి వెంగలి మూక కెలుంగశక్యమే' అనితన కవిత్వ ప్రతిభను 'నటి' ద్వారా తెలియజేశాడు.

దూరాకృష్ట విశ్వ ప్రసృమర మహాసోవీర రుద్రస్య జైత్రశ...అని సంస్కృత సమాసాలకు విద్యానాథునితో 'ఆయనగాలిని పేసును', అని విశ్వాసరావుతో తెలుగు పదాన్ని, 'బళి బళి మా తాత బల్లెంబు నే పట్టి షల్లాకు తూటుగా పొడిచేసి నాడోయ్' అని వెఱ్ఱివాని చేత పలికించడంలో వేదం వారి ప్రతిభ గోచరిస్తున్నది. నాటకంలో చివరికి ప్రతాపరుద్రునికి సుల్తానుకు మైత్రి జరుపును— యుగంధరుని దక్షతను రాజు—'ఢిల్లీనాథుని మిత్రుజేసితివి .. సర్వజ్ఞ యాశాస్యముల్' అని కృతజ్ఞతో పలికిస్తాడు భరత వాక్యములో 'మాలినీ' వృత్తాన్ని వుపయోగించాడు. (వానలులోక... బుధుల్) ఈ విధంగా నాంది భరత వాక్యం వరకు శాస్త్రిగారు బిగువైనన టెంపోతో, నిండైన తెలుగుతో రచించారు.

దేశసార్వభౌమత్వానికి, సమైక్యతకు ముప్పు వాటిల్లినపుడు, సనాతనము నుండి భారతీయులు ఉద్యమస్ఫూర్తితో స్పందిస్తూ తమ సంస్కృతిని సంప్రదాయాన్ని రాజ్యాన్ని పరిరక్షించుకొంటూనే ఉన్నారు.— రాజు విపత్తులో ఉన్నపుడు రాజ్యం అన్యాక్రాంతమైనపుడు ప్రజా ప్రతిస్పందన ఎలా ఉంటుందో 'ప్రతాపరుద్రీయం' చక్కగా తెలియజేస్తుంది. యుద్ధమే పరిష్కారము కాదని, ఇరుగు పొరుగు దేశాలతో సత్సంబంధాలను కలిగి మైత్రీభావంతో ఉండాలని సూచిస్తుంది.

కన్యాశుల్కము గొప్పనాటకమే! ఒకానొక వ్యవస్థలో ఒకానొక ఆచారము దురవస్థకు గురిచేసినపుడు, ఆ సంఘమెలా కలుషితమయి పోతుందో తెలియజేస్తుంది నాటకం. ఈరెండు నాటక రచనా కాలపరిస్థితులు (1892-95), భారతదేశ స్వదేశాభిమానం అప్పుడప్పుడే తలెత్తినకాలము భారతీయ తత్వాన్ని సంప్రదాయాన్ని వేదంవారు చూపించారు. 'క్షిప్ర గమనమును, జీవదద్భుత బహువిధపాత్ర సంపత్తియు, తదనుగుణ భాషావైలక్ష్యమును కలిగి రసోల్లితమైన నాటకం ప్రతాపరుద్రీయమేనని విమర్శకుల అభిప్రాయము.

ఈ నాటకం యొక్క ప్రత్యేకత కేవలం భాషా ప్రయోగమును బట్టి రాలేదు— అన్నిటిని మించి నాటకంలో జాతీయతాభావము అంతర్వాహినియై ఆసాంతం ప్రవహించినట్లుంది. కనుకనే 'ప్రతాపరుద్రీయం' 'నాటకాంతం హి సాహిత్యమ్' అను భాషణానికి నిదర్శంగా నిలిచింది—ఏదిఏమైనప్పటికిని, ఈ రెండు నాటకములు సూర్యచంద్రులవలె, ఆంధ్రభాషా జగత్తున వెలిగేవని ప్రతి తెలుగువాడు ఒప్పుకోవాల్సిన విషయం.

# కవితావీథి

## రామబాణము
### ఏకాదశ సర్గము

—ఊట్ల కొండయ్య

పల్లె నడిమి మఱ్ఱి కునికి పడుట గాంచి
యరచె నందున్న పికము కో యనుచు, నదరి
పడి వట మ్మాకుగను లెత్తి కదలు చూచె
జొన్నచే లూపె కంకుల సొన్న తలలు, 1

రచ్చబండపై నున్న వారలకు కూర్చి
యుండ కుదురక వేచుచునుండు వారు
లేచి కూర్చుండు వారును, లేచువారి
యడుగొకళ్ళ ముం దొకటి వెన్క బడుచు
నుండ, 2

మునివరు రాక జాగగుట,
పోయి కనుంగొని వత్తుమన్న వా
రును తడయన్ కతమ్మెదొ
యెరుంగక వ్యగ్రమనస్కులైన యా
జనపదా లిట్టిదట్టిదను
చర్చల నెద్దరికేని రాకయుం
దినతరి నిర్వు రూరుపులు
డెందము లూపగ పర్వి వచ్చినన్, 3

ఏమాయె నేమాయె నేడయేడ మునీంద్రు
డని గట్టుతెగిన కొలని జలమ్ము
గలగల దూకునట్టులు జానపదులును
వార్తావహుల జుట్టి యార్తితోడి
యెలుగుల ప్రశ్నింప నేకముఖమ్మున
దూత లవ్వారల దుముకులాపి
వచియించి రాజనపదముఖ్యు పునుపు, న
య్యది విని యానంద సదనులైన
ప్రజకు, తమ పీట పుణ్య సంపదలు మెట్టు
నట్లు, తత్పద ... లు కనునట్లు, వాని
మెట్టియల చప్పుడులు వినునట్లు తోచె
భ్రమ యనినయట్టు లొక రెప్పపాటు
తరిని_4

కనుల, వారికి రూపము కంటె, జాను
గులకు గానము కంటె, జిహ్వలకు రుచుల
కంటె, నాసికలకు తావి కంటె, మెయికి
ప్రవనమును మించు నెదొ యనుభవము కలిగె-5

కోటికోటి సుగంధ కుసుమమ్ము లొకపరి
వికసించి వలపు వ్యాపించినట్లు
పల్లె నింటింట నా వర్తమానము నిండె
గృహిణు లందందు ముంగిళుల జేరి
పలుకజొచ్చిరి చుట్టములు నూరముండి వ
చ్చెడినట్లు, లాదరించెడిదె భాగ్య
మైనట్లు, కష్టసుఖానందముల పాలు
పంచి తామును వారు బ్రదుకునట్లు

దినములను పండువులుగ పదినెలు తీర్ప
నన్న లుందురు రారాజు లన్నయట్లు
లనుచు కేరింతలాడు నిల్లాంద్ర గలసె
గ్రామణి సతిమణియు కల్పకమ్ము వోలె.— 6

తానమాడ నిప్పుడుడు పొంతలను, నలుగు
పిండ్లు పెట్టుడమ్మ మరుగు పెరడులందు
వచ్చు వేళాయె ముప్వురు వదినె లిటకు
పెనిమిటులతోడ నని త్వరపెట్టె నామె — 7

తిలల తైలమ్ము కలదింట తెచ్చుకొనుడు
తలలనంటు దేమరకుడు తడయ వలదు
బానసమ్ము మన యిల్లె సత్వరము రండు
రండనుచు నామె పరచె కురంగి యట్లు. 8

అన్యసతు లనురక్తి పూర్ణాంతరంగ
జన్య కాంతులతో ముఖాబ్జములు వెలుగ
కిలకిలల నిండ్లకేగి విధులు తెమల్చి
చనిరి గ్రామణి యరవున పనులు దీర్ప. 9

మరికొంత వడికి మరిన్
దరిసి యనెన్ గ్రామపతి సుదతి, సిద్ధము చే
సిరి సర్వమ్మున్ మీకెదు
తరుగుడు కొనితేర వారి నాయెన్ తడవున్. 10

అనుచండ నొకం దలయుచు
చనుదెంచి యనెన్ మహర్షి సహజనములతో
జనపదము జేరవచ్చెడి
నన పర్విడి రెల్లవార లచల చలింపన్. 11

గనిమ కర పూజ యందున్
జనపదమున నర్చనమ్మునన్ పెక్కుర గ
న్గొని వృద్ధుల ముని యనె
ననన్య భాగ్యమ్ము పల్లె కబ్బె నిటువలెన్. 12

ఎట వృద్ధుల్ సుఖశాంతు లందు
వసియింత్రెల్లప్పు డాపల్లె చెం
గట వర్తించు ననంతజీవన
పరిజ్ఞానాత్మకమ్మైన యు
త్కట సౌభాగ్యపథమ్ము వృద్ధులు
నమస్కారార్హులై యుందు రె
చ్చట, నచ్చో వసియించు పుణ్యులకు
నైజమ్మౌ చిరాయుష్యముల్ 13

అనుచు ముని రచ్చపట్టున జనులతోడ
జొప్ప యుపవిష్టులయి చెప్పజొచ్చె మగుడ
ముదుసళుల నీసడింతురు, ముదిమి తమకు
రాని వారైనయట్లు మూర్ఖతమ జనులు 14

బాల్య కౌమార యౌవన ప్రౌఢ వృద్ధ
దశలు రెండు వాకిళుల మధ్యమున గదులు
జీవదశ లొకటియె వేరు కావు. గృహము
వలెనె, కనగల్గు కనుటుండ వలెను కాని 15

ముదిమి బసితనంపు పోడుముల్ పొడసూపు
టద్భుత మనిపించు నరయ నరయ
జీవచక్ర మిట్టి కైవడి భ్రమియింప
దేన ప్రేషితమ్మొ తెలియరాదు
మనుగడకు తోష మొసగున్
తనుజుల కాదర్శకమగు, తనసతికిన్ శి
క్షణమగు, జననీజనకుల
కును వార్ధక్యమున సేవకుడగు నరునెడన్. 17

ఆయువుతీరి యేగె జరు
    దందు రనాదరణమ్ము మారుపే
రాయెగదయ్య యిట్టి వలు
    కివ్విధి నవ్విధి తూలనాడు చే
న్యాయమొ నిర్ణయింపుడు,
    ప్రియమ్మున వేళకు నన్నపానముల్
పాయక కల్గెనేని స్థవిరమ్మున
    మృత్యువు దూరమై చనున్. 18

అందొక వృద్ధు జీరి ముని
    యన్న వచింపగదయ్య యిందు నే
చందము సాగు వార్ధకము చాయల
    నన్న నతండు, మౌనికిన్
వందన మాచరించి యిటు
    వాకొనె బిడ్డల గూడి వృద్ధులున్
తిందురు తొల్త నాపయిన
    తింద్రు తదన్యు లిటన్ త్రికాలముల్ 19

ఆ మాటలు విని హృష్టుం
డై మౌనీంద్రుండు శుభము లగుమీ కనుచున్
గ్రామణి జేర్కొని, యిటులై
తామరతంపరగ నెసగుతన్ ధర్మ మనెన్
అంత సత్యంగనస్నాతులై వినూత్న
వసనములు దాల్చి జన్మించి వచ్చు మనుజు
లటు లయ్యార్యు రేతెంచి యమ్మహర్షి
పదములం బడ దీవించె పరమయోగి. 21

అంతలో వచ్చె గ్రామణి కాంత, 'స్వామి!
తడవు జేసితిమని కోపపడెడి నట్టు
వినుడు గక్కున నింగి దిగెను కనుండు
జనపదము మీది కొరగి రాసాగె తంద్రి! 22

లెండు సహపంక్తి తిందురు లెండు స్వామి
పేదలము' పట్టెడన్నమె పెట్టగలము
భక్తియొక్కటె సర్వలోపముల దీర్చు
షడ్రసాన్నము, సత్కృతి సౌహృదమ్మె. 23

అని చనుచున్న వాక్యవిదు
    రాలిని సాదరదృష్టి జూచి, యా
జనసముదాయమున్ కలసి
    చయ్యన భోజన మాచరించి,య
మ్మౌని యట రచ్చగూర్చొనె
    ప్రమోద జనావృతుడై, తలంచె గ్రా
మణిసతి యాతిథేయ మహిమన్,
    కని తత్పతి నంత నిట్లనెన్ 24

గ్రామణీ! జంపతిత్రయ
    సరమ్మున జెప్పుము నా నతండనెన్
భూమికి లోటులే దిచట
    ప్రోవులు బంగరు పంట పండు; మా
ప్రేమకు లోటు లేదు, కల

వేశము నేనియు పంచి తిందుమో
స్వామి! త్వదంఘ్రి సాక్షిగ
ప్రసన్నుడవైవరమిమ్ము దీవెనల్ 26

విశ్వామిత్రుండ వగు తండ్రి! విశద మిద్ది
తిన్న తిందుము మేము, ప్రస్తున్న నుందు
లిరవు లున్నవి వారి కాపురము కొరకు
స్వామి: వారును మేము నీసంతె కాదె!

అన మునియున్ పునర్జనన
మందిన యార్యుర దిక్కుఁజూచి, యి
జ్జనప్రద సచ్చరిత్ర నను
సంధిత జీవనులై సుఖింపుడీ"
యనుచు నొసంగె దీవెనల,
నంఘ్రులకున్ ప్రణమిల్లి వార లి
ట్లనిరి,' త్వదాత్మసంభవుల'
మయ్యును నన్యుల మౌదు మెట్లులన్'?

# మిగిలేది తళుకు

డా॥ పోతుకూచి సాంబశివరావు

అది ఎంతో అనంతమైన విశ్వం
ఇది ఇరుకుల చీకటిగది
ఆ స్వేచ్ఛా వాతావరణంలో గాలి, నీరు
పవిత్రం, పరిమళం
ఈ సంకుచిత గదిల్లో
కుళ్ళు కుళ్ళుతోంది.
అచ్చట చూసే విశాల కమలనయనాలు
ఇచ్చట బాధతో నిద్రిస్తున్న మంటల కనురెప్పలు
అనాదిలో జీవనం ఆరుబయటే
ప్రకృతిమందిరంపై ఆకాశం పందిర
ఆనాటి హాయిలో స్వేచ్ఛలో అజ్ఞానం
ఈనాటి విజ్ఞానంతో స్వేచ్ఛ, హాయి బందీ.
మనిషి బ్రతుకు బుద్బుదంలా
గాలిలో తేలి, పల్టీలు కొట్టి
ఎక్కడో కొండరాయికి తగిలి
బ్రద్దలై అదృశ్యమౌతుంది
గాలిబుడగ ఎగిరేటప్పుడు
నీలినీడల్లో, ఆమెరుపు
భావనలో మిగిలేతళుకు—

న్యూ బోయిగూడ, సికింద్రాబాదు. 6–8–195.

# మేం

— పుట్టపర్తి నాగపద్మిని

మేం కవల పిల్లలం
మా నడకా మా పడకా ఒకచోటే
మా రూపూ మా చూపూ ఒకటే
మా సృష్టీ మా దృష్టీ ఒకటే
మా అనుభవాలూ, అవసరాలూ
మా అంతర్మథనాలూ, అంతరాత్మలూ
అన్నీ....అన్నీ ఒకటే....
ఇంత వరకూ జీవితంలో
అబ్బో...
చాలానే చూశాం...
పట్టు పరుపుల్లా పరువాల్ని విరియబోసే
పచ్చిక బయళ్ళనూ
అందీ అందక అందాల్ని చిందించే
మధురస ఫల వృక్ష శాఖలనూ
ముగ్ధ మనోహర రేసురభిళాల్ని పంచే
మరు మల్లె పొదలనూ
పాతాళ లోకపు అంచులనూ
అంతరిక్షపు అగాధాలనూ
ఒకేసారి గుర్తుకుతెచ్చే
దిగుడు బావుల దురుకుతనాన్ని
ఇంకా చాలా చాలానే చూశాం....
నరాలను శ్రుతి చేసి
స్వరాను భూతిని కలిగించి
హృదిని రసప్లావితంచేసే సౌందర్య సారాన్ని
మనసారా గ్రోలాం...
కానీ....
అనుకోకుండా ఓ ఉపద్రవం వచ్చిపడింది
మా అనుభవాల సంపదని
ఆవగింజలా చిదిమి,
గగనాంతరాళంలా హృదినంతా ఆక్రమించే
ఉపద్రవం వచ్చిపడింది మరి....
కొత్త లోకాల కాంతులను
కోటి దివ్వెలుగా వెలిగించి
మా పలిత కేశాల్ని రాగరంజితం చేసి
చమత్కారంగా నవ్వి కవ్వించే ఉపద్రవం అది
పచ్చిక బయళ్ళ మృదుత్వాన్ని

24-886-ఆనంద్‌బాగ్, హైదరాబాద్- 500 047.

మధు రస ఫలాల మరందాన్నీ
మరుమల్లెల మనోల్లాస పరిమళాల్నీ
కలబోసి
సృష్టిలోని సౌందర్యాన్నంతా కలిపి
ఏకాగ్ర చిత్తంతో సాకారం చేసినట్టు
మాముందు నిలిచిందో
స్వర్లోక పారిజాతం,..
ఆ సుమ వాసనలు మమ్మల్ని తాకగానే
ఎందుకనో అనిపించింది....
మా అనుభవ సంపద
కేవలం అచ్చుతప్పుల 'పదకోశమ'ని
మా పలిత కేశాల విజయ పతాకలు
జీవన సమరంలో ఓడి
మనసు ఎగరేసిన శాంతి పతాకలని'
ఆ పారిజాత సుమసౌరభం
మా వూహా లోకాలకి చీకటి తెరవేసింది.
మా రెక్కల వేగాన్ని కనికట్టుతో కట్టేసింది.

ఇప్పుడొక్కటే మాధ్యాస
గజదొంగలమెలా అవ్వాలని !
ఆ అందని పారిజాతం
మా హృదయ కుసుమమెలా అవుతుందని:
ఇంతకీ మే మెవరన్నదేగా మీ ప్రశ్న!

మేం...

ప్రపంచ పుటల్ని జంటగా తిప్పే ప్రేశ్నం
జీవన మార్గాన్ని జంటగా కొలిచే
జోడుగుర్రాలం
జతేసేం:
రసాన్వేషణలో నిరంతరం
పరిభ్రమించే
పరిక్రమించే
భ్రమణాలం...
మేం....
చత్వారపు కళ్ళద్దాలం

# నా చెల్లెలు

చిటిప్రోలు వేంకటరత్నం

అదిగో నాచెల్లెలు
ఆమె గుండెల్లో బాధల గ్రీష్మాలు
ఆమె మెదడులో ఆలోచనాశిశిరాలు
జీవితం ఒక పెనుబండ
    ఆమె శిరసుపై...
ఆమె తండ్రి అడుగో
    త్రాణ లేని ప్రాణి
పిడికెడు బిళ్ళలు రాల్చే
ఉడుతంత ఉద్యోగమేలే
ఉన్నతమైన జీవి
ఆమె తల్లి—
    పెక్కు విధాల రోగాలు
    పెద్ద పెద్దగోలలతో
    మోజుపడి ఆటలాడుకునే
    ముచ్చటైన మైదానం

కుటుంబ చింత
వేదనల కాలంబం...గలగల మోగే పిల్లలతో
కంటకాల మధ్య—

కఠినశిలల నడుమ ఆమె యానం
కఠోరమైన హాలాహలం
    ఎదదల్లో కరక్కైత్తగా

కటిక పల్కులు పల్కే
కాకుల లోకుల ఈటెల గాటులు
ఆమె సహించాలి

ఈ అగ్నిగుండం నుండి
ఆమెకు విముక్తి ఎప్పటికో
    ఎన్నటికో

14–64–1 గీతామందిరం వద్ద లక్ష్మిటాకీస్ రోడ్డు మిర్యాలగూడ. 508207

# తత్త్వ-వేదాంత-చింత

నిమ్మరాజు వెంకట కోటేశ్వరరావు

కాయమందు, ఎన్ని—గాయంబులైనను
మాన్పవచ్చు చాల-మందులిచ్చి।
మనసు, గాయమైన—మరిమందు,లేదయా!
'నిమ్మరాజు' మాట—నీతి, బాట

నేలబడిన, క్షణమె_గోళ చేయును జీవి
బేలగాను, తూలు_పాల- మనసు
పాలకొఱకు, గాదు_ఏల పుట్టితినంచు
'నిమ్మరాజు', మాట_నీతి, బాట

సూనృతమును, వీడి—సూక్ష్మబుద్ధిని,వీడి
మానవతను వీడి—మమత, వీడి
చేటు, చేయుపనులు—చేయబోకెన్నడు
'నిమ్మరాజు', మాట—నీతి, బాట

తలచి, చూడకున్న-తత్త్వంబు,దెలియునా
కనులు తెఱవకున్న—కాంచగలమె
అరిచి, పిలువకున్న—హరియైనవచ్చునా
'నిమ్మరాజు' మాట—నీతి, బాట

అహము, వీడినంత—నగుపించు, దైవమ్ము
సాధనమున, పనులు-సాధ్యపడును
సహనమున్న మహిని—సాధ్యపడనిదేది,
'నిమ్మరాజు', మాట—నీతి, బాట

అంతరాత్మలోనే—అలరారు, చుండును
ధవళ, వర్ణభాసి-దైవమెపుడు
అతని, చేరు పంత-ఆధ్యాత్మికపు, చింత
'నిమ్మరాజు', మాట-నీతి, బాట

చిఱుత, మేనిపొదలు—చెఱుప, శక్యమౌనె
'తుహిన' 'కిరణ'మిచ్చ-తుడువనౌనె
పుడుకతోనేపోవు-పుట్టెపుట్టిన, బుద్ధి
'నిమ్మరాజు' మాట—నీతిబాట

గరిక, పేనియైన—కరిని, కట్టగవచ్చు
మూటగట్టగచ్చు-నీటి నైన
సృష్టిలోని, కిటుకు-చెప్పశక్యంబౌనె
'నిమ్మరాజు' మాట-నీతిబాట

ఎంత, విద్యయున్న—ఎంతవిజ్ఞతయున్న
కాంతి, దాంతి, నిచయ-మెంతయున్న
వచ్చపైకమన్న_పడి, చావకుందురా
'నిమ్మరాజు' మాట-నీతిబాట

లాయరుపేట, ఒంగోలు—523 002.

# మందార మాల

## ధర్మజుని ధర్మజ్ఞత- యక్షప్రశ్నలు

ఎవరైనా ఏదేని ఒక విషయమును గురించి మనలను ప్రశ్నిస్తే దానికి తగిన జవాబు మనం చెప్పలేకపోయినచో అప్పుడు అబ్బ ఆవేం యక్ష ప్రశ్నలు? అని విసుక్కుంటాం. ఈ యక్ష ప్రశ్నలు అనేది ఒక నానుడిగా జనసామాన్యంలో నిలిచి పోయింది.

యక్షుడు అడిగిన ప్రశ్నలకు తగిన సమాధానం భీమార్జునులు చెప్పలేక పోయారా? యక్షుడు ప్రశ్నవేస్తే చెప్పే సమాధానం మళ్ళీ అతనికి నచ్చాలి. అందుచే ఆ ప్రశ్నలకు సమాధానం కొద్దిగానో గొప్పగానో యక్షునికి తెలిసి యుండాలి. లేదా పూర్తిగా తెలియకుండానే ఉండాలి. పూర్తిగా తెలియనప్పుడు ధర్మరాజుచెప్పిన సమాధానాలు యెలా నచ్చాయి? ఇది కూడా మరొక విధమైన యక్ష ప్రశ్న. అసలు యీ యక్షుడెవరు? అనేది తెలిస్తే అసలు యీ ప్రశ్నల ఉదంతం తెలుస్తుంది.

పాండవులు అరణ్య వాసము చేయు సమయంలో ఒక నాడు ఆహారము తేబోయిన భీముని అజగర మొకటి పట్టుకొనెను. భీముడు దానిని విడిపించుకు రాలేక పోయాడు. భీముని వెదకుచు ధర్మరాజు అక్కడకు వచ్చి ఆ పన్నగముతో సంభాషించెను. తన ప్రశ్నలకు సమాధానము చెప్పినచో భీముని విడిచెదనని ఆ పన్నగ మనగా, ధర్మరాజు సమాధానములు చెప్పుటకు ఒప్పుకున్నాడు. బ్రాహ్మణుడన నెట్టివాడు? మొదలగాగల ప్రశ్నలకు ధర్మరాజు సమాధానము చెప్పి భీముని విడిపించుకున్నాడు. అనగా భీముని కంటె ఆ అజగరమే బలమైనదా? ధర్మరాజు వచ్చేదాకా అది భీమునికి యే ఆపదా కలుగ జెయ్యలేదు. ధర్మరాజు సమాధానములు చెప్పి భీముని విడిపించుకున్నాడు. ఈ విషయాన్ని సూక్ష్మంగా ఆలోచిస్తే ఆ అజగరమనేది మహాపద, అది చుట్టుముట్టితే యెటువంటి బలవంతులైనా తలొగ్గవలసిందే. ఉపాయంతో అపాయాన్ని తప్పించుకోవాలి, బుద్ధి సూక్ష్మత ఎటువంటి కార్యమునకైనను సాఫల్యము చేకూర్చును, అని చెప్పడానికే యక్షుని బారిని పాండవులు పడక ముందే యీ సంఘటన జర్గింది. ధర్మరాజు ధర్మజ్ఞుడు, బుద్ధి సూక్ష్మత కలిగిన వాడు. కౌరవులు అధర్మంగా మాయాజూదం నెరిపారు కాని అదే ధర్మయుక్తంగా ఆడితే ధర్మరాజు ఓడిపోక పోను విధివిలాసానికి ఎవరేనా బద్ధులే అని సమర్థించుకోవాలి. 'బుద్ధిః కర్మానుసారిణీ' భారత

కథ చాలా దూరం నడపాలి అంటే ధర్మరాజు అరణ్యవాసం చెయ్యక తప్పదు.

వనవాసము ఇంక కొద్దికాలంలో ముగుస్తుంది. అనగా ఒక బ్రాహ్మణుడు ధర్మరాజు చెంతకు వచ్చి తన అరణిని ఒక మృగము యెత్తుకొని పోవుచున్నదని, దానిని తెచ్చి యిమ్మని కోరెను. ధర్మరాజు, సోదరులు ఆ మృగమును తరుముకొనుచు వెళ్ళారు. కొంత దూరం వెళ్ళేసరికి అది అదృశ్యమయింది. దానిని తరుముచు చాల దూరం వెళ్ళుటచేతారు. అలసట చెంది దప్పిగొన్నారు. దగ్గరగా నీరమున్నచో తెమ్మని ధర్మరాజు నకులుని పంపెను. అతడొక కొలను చూచి అందు దిగబోవుచుండగా నొక్క అశరీరవాణి 'ఇది నా కొలను. నీవు నీరు త్రాగదలచినచో ముందుగా నా ప్రశ్నలకు సమాధానము చెప్పుమని' పలికెను. అతడు లక్ష్యపెట్టక నీరుత్రాగెను వెంటనే స్పృహ తప్పి పడిపోయెను. అతడెంతకును రాకపోవుటచే సహదేవుడు పంపబడ్డాడు అతడు కూడా స్పృహ తప్పాడు. అర్జునుని భీముని పంపగా ఎవరునూ తిరిగి రాకపోవుటచే వారలను వెదకుచు దుఃఖించుచు ధర్మరాజు ఆ కొలనుచెంతకు చేరెను అశరీరవాణి' నేనొక్క బకమును ఈ కొలను నాది. నీవు నీరు త్రాగదలచినచో ముందుగా నాప్రశ్నలకు సమాధానము చెప్పు. వీరు నిర్లక్ష్యంతో యీ స్థితిని, గతిని పొందారుఅన్నది' అది విని నీతికోవిదుడైన ధర్మరాజు నీవు బకము కాజాలవు. ఎవ్వరవో మహానుభావుడవు. బకమునకు నా సోదరులు నిస్పృహులగు వారు కాదు అని ధర్మరాజన్నాడు. అంటే బకమని చెప్పుకునే ఆ అశరీరవాణి భీమార్జునుల కంటె బలమైనదే. అందుకే అంతటి బలశాలి భీముడు కూడా నిర్జీవుడయ్యాడు. తమ్ముళ్ళను చూడగానే ధర్మరాజు గ్రహించిన విషయమిది. అంటే ధర్మరాజు అంత సూక్ష్మగ్రాహి. పరిసరములలో యెక్కడా యుద్ధము జరిగిన జాడలేదు. ఇది ఒక వీక్షణంలోనే గ్రహించాడు. ధర్మరాజు తక్షణ కర్తవ్యం తన తమ్ముళ్ళ రక్షించుకోవడం. ఇదే విషయాన్ని భీముడు గ్రహించ లేకపోయాడు. అంటే భీమునికి ఆవేశం తప్ప ఆలోచన తక్కువ.

అందుకే విరాటరాజు కొలువులోని ద్రౌపదిని అవమాన పరచిన కీచకుని సంహరించుటకు పరిసరములు తనకు అనుకూలముగా ఉన్నవా? లేవా? అనే విచక్షణా జ్ఞానమును కోల్పోయి. పరిసర వృక్షమును పెరుకబోయెను ధర్మరాజు కనుసైగతో భావ గర్భిత మాటలతో వలదనుటచే ఆ ప్రయత్నమును విరమించుకున్నాడు.

ధర్మరాజు తన సంశయమును వెల్లడించగనే 'నేను బకమును కాను, ఒక యక్షుడను'. అని తన ఉగ్రరూపముతో ఆ కొలను చెంత నిలిచి నా ప్రశ్నలకు సమాధానము చెప్పకయే యీ నీరమును త్రాగిన వారు మరణింతురని' చెప్పెను. ధర్మరాజు ధర్మజ్ఞుడు కనుకనే అహంకారము లేక నా నేర్చిన కొలదిని సమాధానము చెప్పుదుననెను. ధర్మరాజు వినయ విధేయతలే అతని జయమునకు కారణములయ్యాయి. యక్షుడు కూడా ప్రసన్నుడయ్యాడు.

యక్షుడు వేసిన ప్రశ్నలు వ్యాసభారతంలో నలుబది ఆరు శ్లోకాలలో ఉన్నాయి. వాటికి అన్నింటికి ధర్మరాజు సమాధానం చెప్పాడు. తొణక లేదు. బెణక లేదు, వెంట వెంటనే సమాధానములియ్య గలిగిన విజ్ఞానానికి యక్షుడు సంతృప్తుడై ధర్మరాజుకు మరో పరీక్ష పెట్టాడు నీ తమ్ములలో ఒకనిని బ్రతికింతును. కోరుకొమ్మనెను. ధర్మరాజు యెక్కువ సేపు ఆలోచించలేదు.

న్యాయ, ధర్మం తెలిసినవాడు కాబట్టే నకులుని బ్రతికించు' మన్నాడు కుంతీ పుత్రులలో నేనుంటిని కనుక మాద్రీతనయులలో ఒకనిని బతికించుమని కోరితిని. దయ యుంచి వానిని బ్రతికింపుమని వేడుకొనెను. యక్షుడు ధర్మరాజు ధర్మజ్ఞతకు మెచ్చి వారి నందరను బ్రతికించెను. అప్పుడు యక్షుడు తన నిజ వృత్తాంతమును చెప్పెను. నేను యముడను ధర్మరాజును. ఈ రూపంలో మిమ్మల్ని పరీక్షించుటకై మృగమును బ్రాహ్మణుని కల్పించితిని అని చెప్పి మీకు వనవాసము ముగిసినదనియు అజ్ఞాత వాసములో మీరు కోరిన రూపములు మీకు వచ్చుననియు, మిమ్మలను ఎవరును గుర్తింపలేరనియు చెప్పి అంతర్ధానమొందెను

యక్ష ప్రశ్నలు 46 శ్లోకాలలో మొత్తం 90 ప్రశ్నలు యక్షుడు అడుగగా ధర్మరాజు నిస్సంకోచంగా సమాధానాలు చెప్పాడు. అసలు యక్షుడు ఇటువంటి ప్రశ్నలను ధర్మరాజును యెందుకు అడుగవలసి వచ్చింది అంటే అరణ్యవాసం పూర్తిచేసి అజ్ఞాతవాసం చెయ్యాలి, తర్వాత భారత యుద్ధం సంభవిస్తుంది. వీటిని యెదుర్కొనే శక్తికి ధర్మరాజును పేరేపించడం కోసమే యమధర్మరాజు సూచన ప్రాయంగా 'ధర్మో రక్షతి రక్షితః' అన్నట్లుగా ధర్మరాజును హెచ్చరించాడు. కొద్దిగా సూచిస్తేనే చాలు దాన్ని పూర్తిగా అర్థం చేసుకొనే సామర్థ్యం ధర్మరాజుకి ఉన్నది. ధర్మరాజు అవగాహనా సామర్థ్యం, బుద్ధి సూక్ష్మత ధర్మజ్ఞత మనకు ఆది పర్వంలోకూడా కన్పిస్తుంది.

ఆది పర్వంలో దృతరాష్ట్రుడు పాండవులను వారణావతంలో ఉత్సవాలు చూడటానికి పంపారు. పురోచనుడు దుర్యోధనుని దురాలోచనా ప్రోద్బలంచే లక్కయింటిని నిర్మించాడు. పాండవులు ఆ ఇంట్లో ప్రవేశించగానే పురోచనుడు. ఆదను చూచుకుని ఆ యింటికి నిప్పంటించాలి. అప్పుడు ఆయింటితో పాటు పాండవులు కూడా మరణించాలి. ఇది యోచన అది విదురుడు కనిపెట్టాడు. పాండవులు ప్రయాణమై వెళ్ళు సమయంలో సభలో అందరూ వింటుండగానే విదురుడు ద్వంద్వార్థయుతమయిన వాక్యాలుపలికాడు. 'శత్రు వ్యవహారాలను అవగతం చేసుకున్నవాడు ఆ ప్రమాద నివారణకు యత్నించాలి లోహ నిర్మితం కాని శస్త్రం ఉన్నది. దాని కూడా ఉపాయం నుండిరక్షించు కోవాలి ఎండిన గడ్డితోనున్న అడవి మండుతున్నా కలుగుతో దూరిన ఎలుక నాశనంకాదు. తర్వాత అది సరి అయిన దారి అందుకొని బైట పడుతుంది దిక్కు తెలియడానికి నక్షత్రం ఉంది. పంచేంద్రియాలనూ స్వాధీనంలో ఉంచుకున్న నాడు శత్రు పీడనుండి ముక్తుడౌతాడు.' అన్న విదురుని మాటలు ధర్మరాజుకి అవగత మయ్యాయి

శస్త్రం అంటే సస్త్రం. అనగా యిల్లు. ఆ ఇల్లు అగ్నితో దగ్ధమవుతుందనీ అందుకు తమతో ఉండబోయే పురోచనుడే కారణం అవుతాడనీ రక్షణకు బిలమార్గం నిర్మించుకోమనీ, పంచేంద్రియాలంటే సోదర పంచకమనీ వీరు ఏకాభిప్రాయంతో ఉంటే యేప్రమాదమూ రాదనీ దీర్ఘాలోచనాపరుడైన విదురుని ఉపదేశం సూక్ష్మ గాహియైన ధర్మరాజు గ్రహించాడు. వెంటనే ఆవేశపడలేదు. ఆ ఇంట్లో చేరగానే నేతివాసన రావడంలో ఆ విషయం భీమునికి చెప్పాడు మనం యిప్పుడే భవనాన్ని విడిచి పెడదాం అన్నాడు భీముడు ఆవేశంగా. అప్పుడు ధర్మరాజు యిలా అన్నాడు. అది ధీమంతుల లక్షణం కాదు. దుర్యోధనుడు గూఢచారులతో మన అనుపానులు కనిపెట్టి

కడతేర్చే ప్రయత్నం చేస్తాను.' అని అన్నాడు. అంటే ధర్మరాజు అంతటి దూరదృష్టి కలవాడు.

యక్ష ప్రశ్నలు వానికి ధర్మరాజు యిచ్చిన సమాధానం నిశితంగా పరిశీలిస్తే ధర్మరాజు యొక్క అనేకానేక సద్గుణ సంపత్తిని అర్థం చేసుకోగలుగుతాము. ఇది కేవలం ధర్మరాజుకు ఒక్కనికే కాదు. అందులో ప్రతి విషయం సర్వకాలం సర్వావస్థలలో సమస్త జనులు పాటించ దగిన ధర్మ ప్రబోధం దాగి యున్నది.

## యక్ష ప్రశ్నలు— ధర్మరాజు సమాధానాలు

1 + 2 శ్లో॥

1. సూర్యుణ్ణి ఉదయింప జేసేది ఏమిటి ?
బ్రహ్మము

2. అతని చుట్టూ తిరిగేవారెవరు?
దేవతలు

3. అతనిని అస్తమింపజేసేది ఎవరు?
ధర్మము

4 ఎవరిపై అతని ఉనికి ఆధారపడి ఉంటుంది?
సత్యం మీద

3 + 4 శ్లో॥

5. దేని వలన మానవుడు శ్రోత్రియుడౌతాడు?
వేదముచే

6. దేని వలన గొప్ప తనమును పొందుతారు?
శ్రమవలన

7. ఎవరు వెంట ఉండుట వలన రెండవవాడుగా అవుతాడు?
ధైర్యం

8. దేనిచేత మనిషి బుద్ధిమంతుడౌతాడు?
పెద్దల పరిచర్యవలన

5 + 6 శ్లో॥

9 బ్రాహ్మణులకు దేవత్వం దేనివలన కలుగుతుంది?
స్వాధ్యాయము వలన.

10. సత్పురుషులతో వారికి గల సమాన ధర్మము ఏది? తపస్సు

11. ఇతర మానవులతోపాటు వీరికి గల మానవ భావము ఏది?
మరణము

12. అసత్పురుషులతో వీరికి సమానమైన భావము ఏది?
నింద

7 + 8 శ్లో॥

13. క్షత్రియులకు దేని వలన దేవత్వం సంక్రమిస్తుంది?
బాణాలూ, అస్త్రాలు వలన

14. వారి దేవత్వం ఏమిటి?
అస్త్రం

15. వారికి సత్పురుషులతో సమానమైన ధర్మం ఏది?
యజ్ఞం

16 వారికి మానవ సహజమైన స్వభావము ఏది?
భయం

17. అసత్పురుషులతో వారికి గల సమాన భావము ఏమిటి?
పరిత్యాగము-శరణన్న వారిని(విడిచిపెట్టడం)

9 + 10శ్లో.

18 యజ్ఞమునకు కావలసిన సాధనము ఏమిటి?
ప్రాణము

19 యజ్ఞమునకు కావలసిన యజస్సు ఏది?
మనస్సు

20 ఏది యజ్ఞమును విఫలము చేస్తుంది?
వాక్కు

21. యజ్ఞం దేనిని అతిక్రమించలేదు?
వాక్కును

11 + 12 శ్లో

22. విత్తనములు చల్లుటకు (వ్యవసాయ దారులకు) శ్రేష్ఠమైనది ఏది?
వాన

23. నివసించు వారికి ఏది ముఖ్యమైనది?
విత్తులు, ఆహారం

24. ప్రతిష్ఠ కల వారిలో (నడచువారిలో) ఏవి ప్రధానమైనవి?
గోవులు

25 పుట్టే వారిలో ఏది వరము?
పుత్రుడు

13 + 14శ్లో.

26. సమస్త ప్రాణులకు ఆమోద యోగ్యుడు అయి ఊపిరి పీలుస్తూ కూడా బ్రతకనివాడు ఎవడు?
దేవతలకు అతిధులకు, పితృదేవతలకు, సేవకులకు, అర్హుడు కివ్వనివాడు, వారికి అర్పించినది తాను భుజించని వాడు, ప్రాణం ఉండి కూడా జీవించని వాడు

15 + 16శ్లో.

27. భూమి కంటె ఏది బరువైనది?
తల్లి

28. ఆకసము కన్న ఏది ఎత్తైనది?
కన్న తండ్రి

29. గాలికన్న వేగం కలది ఏది?
మనస్సు

17 + 81 30 మానవులకు అధికంగా ఉండేది ఏది? చింత

31. నిదుర పోవుచు కన్ను మూయనిది ఏది?
చేప

32. పుట్టగానే కదలనిది ఏది?
గుడ్డు

33. హృదయం లేనిది ఏది?
రాయి

34. వేగంగ పెరిగేది ఏది?
నది

19 + 20శ్లో

35. ప్రయాణం చేసేవాడికి మిత్రుడెవరు?
తోటి బాటసారి

36. ఇంట్లో ఉన్నప్పుడు స్నేహితులు ఎవరు?
భార్య

37. వ్యాధి గ్రస్తునకు మిత్రుడెవరు?
వైద్యుడు

38. మరణించే వానికి మిత్రుడు యెవరు?
దానం

21 + 22శ్లో

39. ఎప్పుడూ ఒక్కడే తిరిగే వాడు యెవరు?
సూర్యుడు

40. మళ్ళీ మళ్ళీ పుట్టే వాడు యెవరు?
చంద్రుడు

41. మంచుకు మంచి మందేది?
నిప్పు

42. విత్తనాలకు స్థానం యేది?
భూమి

23 + 24శ్లో

43 ధర్మం ఆచరించడానికి ముఖ్యగుణం ఏది?
సామర్థ్యము, నిజాయితీ

44. కీర్తికి మూలమేది?
దానము

45. స్వర్గప్రాప్తికి ముఖ్యమార్గం ఏది?
అడిన మాట తప్పకపోవడం.

46 చెప్పుకోదగిన సుఖమేది?
నడవడి.

25 + 26శ్లో.

47 మనుష్యునకు ఆత్మ ఏది?
పుత్రుడు

48. ధైర్యాన్నిచ్చే మిత్రుడు ఎవరు?
భార్య

49. మనుష్యునకు ఏది జీవనాధారము?
మేఘము.

50. మానవుడు చేయవలసినది ఏమిటి?
దానం.

27 + 28శ్లో.

51. ధన్యులకు ఉత్తమ గుణమేది?
దాక్ష్యము.

52 ధనములో ఉత్తమమైనది ఏది?
విద్యాధనం

53 ఉత్తమమైన లాభమేమిటి?
ఆరోగ్యం.

54. సుఖములో ఏది ఉత్తమమైనది?
సంతృప్తి

29 + 30శ్లో.

55. ప్రపంచంలో ఉత్తమమైన ధర్మం యేది?
దయ.

56. ఏ ధర్మం ఎప్పుడు ఫలితాన్నిస్తుంది?
ఋగ్యజుస్సామత్రయ వేద బోధితమైన ధర్మము ఎల్లప్పుడూ ఫలితాన్నిస్తుంది.

57. దేనిని అదుపులో పెట్టుకుంటే విచారముండదు?
మనోనిగ్రహం.

58. ఎవరితో సంధి చెడిపోదు?
సజ్జనులతో.

31 + 32శ్లో.

59. మనిషి దేనిని వదిలితే యితరులకు యిష్టుడౌతాడు?
గర్వం.

60. దేనిని విడిచిపెడితే విచారించడు?
కోపం.

61. దేనిని వదలినచో ధనవంతుడౌతాడు?
కోరిక.

62. దేనిని వదలినచో సుఖపడతాడు?
లోభాన్ని.

33 + 34 శ్లో

63. బ్రాహ్మణులకు ధనం ఎందుకు దానం చెయ్యాలి? ధర్మం ఆచరించడానికి

64 నటులకు నర్తకులకు ఎందుకు డబ్బిచ్చి ప్రోత్సహించాలి? కీర్తికోరి

65 భృత్యులకు దానం యెందుకు చెయ్యాలి? వారి జీవనభృతికి.

66. రాజుకు డబ్బు రూపంలో పన్ను యెందుకు చెల్లించాలి? రక్షణకు.

35 + 24 శ్లో

67. ఈ లోకాన్ని కప్పివేయుచున్నది ఏది? అజ్ఞానం.

68. ఎందుకు యిది ప్రకాశించదు? దేనివలన చీకటివలన.

69. దేనివలన మిత్రులు విడిచిపెట్టబడతారు? లోభం చేత.

70 ఏకారణంచేత స్వర్గానికి పోజాలడు? దుర్జనుల సాంగత్యం.

7 + 38 శ్లో।

71 ఎట్టి వాడు చనిపోయిన వానితో సమానం? దరిద్రుడు

72. దేశం ఎట్టిస్థితిలో నిర్జీవం అవుతుంది? రాజు లేనప్పుడు.

73. ఎటువంటి శ్రాద్ధము వ్యర్థము అగును? శ్రోత్రి, మంత్రవేత్త సరి అయిన వాడు లేనప్పుడు

74 యజ్ఞము యెప్పుడు నిష్ఫలం అవుతుంది? దక్షిణ లేని యజ్ఞం

39 + 40 శ్లో

75. దేనిని దిక్కు అని అంటారు? సత్పురుషులే దిక్కులు

76. ఏది జలము? ఆకాశము.

77. ఏది విషము? ఇతరులను ప్రార్థించుట, యాచించుట

78 శ్రాద్ధమునకు సరి అయిన సమయమేది? శ్రోత్రి దొరుకుట

41 + 42 శ్లో॥

79. తపస్సు అంటే ఏమిటి? తన ధర్మమును తాను నిర్వర్తించుట.

80. తపస్సు యొక్క లక్షణమేది? మనసును వశంలో ఉంచుకొనుట.

81. ఓర్పు అని దేనిని అంటారు? పరస్పర విరుద్ధ ధర్మాలను (శీతోష్ణములను) ఓర్చుకొనుట.

82. ఏది సిగ్గుమాలిన పని? చేయకూడని పనులను చేయుట.

43 + 44 శ్లో॥

83. దేనిని జ్ఞానము అని అంటారు? పదార్థముల వాస్తవిక జ్ఞానం కలిగియుండుట ఆత్మతత్వము నెరిగియుండుట.

84. ఏది శమము శాంతి.

85. ఏది గొప్పదయ? అందరి సుఖమును కోరుకొనుట

86 ఏది ఋజుత్వం? నిష్పక్షపాతం.

87. మానవుడు ఓడించలేని శత్రువెవరు? కోపం

88 అంతులేని రోగం యేది? పిసినారితనం.

89 ఎవడు సాధువు? సమస్త ప్రాణుల మంచి కోరేవాడు.

90. ఎటువంటి వానిని అసాధువు అని అంటారు? దయలేనివాడు.

వై. వరలక్ష్మి
టీచర్స్ కాలనీ,
వడ్డేపల్లి-506730, వరంగల్.

# పుస్తక సమీక్ష

## నిర్వేదము

ఇది కవిపితామహ, పద్య విద్యాధర ఊట్ల కొండయ్యగారి పద్యకృతి. ఇప్పుడు కొండయ్య గారు దెబ్బదియేడేండ్ల వయసులో ఉన్నారు. డెబ్బదేడేండ్ల వార్ధక్యంలో నిబ్బరంతో సిరామాటంగా పద్య రచన చేయడం ఎవరికైనా అబ్బురం గొల్ప కమానదు. 'దాకిరేవు'వంటి నూతన కథా వస్తువుతో కావ్యాలు రచించిన కొండయ్య కవి. ఈ నిర్వేదాన్ని కూడ నూతన రీతిలో వ్రాశారు. కొండయ్యగారు గాంధీజీ సిద్ధాంతాలను సంపూర్ణంగా నమ్మినవారు. దేశభక్తిని, మానవతను జీర్ణం చేసుకున్న ఉత్తమ కవి. అందువల్ల ఈ లక్షణాలన్నీ ఈ కావ్యంలో విలక్షణంగా దర్శనమిస్తాయి. సంకో నస్మృతి దే భగవాన్, కులరాజకీయము, దరిద్ర నారాయణము, వందే మాతరమ్, సింహము; ఖడ్గ శృంగము, కాశ్మీరకుంకుమ, ఈశ్వర అల్లా తేరేనామ్ అల్లా హో అక్బర్. ఈశావాస్యమిదం సర్వమ్ అనే పేర్లు గల తొమ్మిది కాండలున్నాయి. ప్రతి కాండంలోనూ పేరుకు తగిన అంశం చక్కగా సంతరించారు కవి.

ప్రతి కాండంలోనూ ఈశ్వర సంబోధన పూర్వకంగా ఆయా అంశాలను ప్రకటించారు. ప్రస్తుత సమాజంలో మితిమీరిన అవినీతి,అన్యాయం అలాంటి మొదలైన విషయాలకు నిర్వేదం చెందిన కొండయ్య గారు తన ఆవేదనను కావ్యమంతటా ప్రతిబింబింపజేశారు. నటో సస్మృతి దే భగవాన్ అనే మొదటి కాండం లోని దిగువ పద్యం గమనింపదగినది.

రచయిత–ఊట్ల కొండయ్య

వెం రూ. 1–000

ప్రతులకు–కాటూరి కవితాపీఠం
మాధవీ ప్రింటర్సు కుత్బిగూడ,
హైద్రాబాదు–500 027.

---

'నీతికి నిల్చువాని నొకనిం
 గననేరక భారతాంబ ఈ
జాతిని కంటి నెందుకు
 నృశంసుండనేనని వెచ్చ మార్చు, నీ
భూతలమెల్లెడన్ సుగుణ
 మూర్తులు భారత పుత్రులన్న వి
ఖ్యాతి వహించి, మున్ను కలకాలము
 నిల్చినదైతి మీశ్వరా!'

నీతిలేని దుర్మార్గులైన పుత్రులను ఎందుకు కన్నానని భారతమాత దుఃఖించడాన్ని కవి ఈ పద్యంలో చూపించారు.

కులభేదాలను చూచి కవి చెందిన విషాదాన్ని కవి 'కుల రాజకీయము' అనే రెండవ కాండలో ఎలా ప్రకటించారో దిగువ పద్యం తెలుపుతున్నది.

'కులము గుణమ్ముకై వేరయిన,
కుత్సిత కాలము దాపురించె, వృ
త్తులను. ప్రవృత్తులన్ పరగతుల్
మరగెన్, మరేమియన్నదీ
కులముల గమ్య మోటులకు
కోటలు గట్టుటగాక, రాజకీ
యుల దురితమ్ము లెంచవది
యోర్వనగున్ వచియింపు మీశ్వరా!'

రాజకీయ నాయకులు కేవలం ఓట్ల కొరకే కులభేదాలను సృష్టిస్తున్నారని కవి ఆవేదన.

కాశ్మీర కల్లోలాన్ని నలుపది ఆరేండ్ల కింద జిన్నా సృష్టించాడని 'కాశ్మీర కుంకుమ' రెండవ కాండలోని పద్యం.

'తన మత ప్రజలట మనముగుటకు 'జిన్న'
కాశ్మీరమ్ము తనకు కావలెనని
దాడి మూకలంపి దారికె నల్వదినూరు
వత్సరముల నాడు పొడిదప్పి'

'ఈశ్వర అల్లా తేరే నామ్' అనే సప్తమ కాండలో ఈలా ఉగ్గడిస్తున్నారు కొండయ్య గారు.

'అందరొక్క తల్లిబిడ్డలే యన్న నిక్క
నమ్ము దేశహితమె స్వహితమ్మనియెడు
నిష్ఠ మైనారిటీలలో నిలువదేని
వమ్ము జాతి సమైక్య భావమ్ము సుమ్ము.'

'ఈశావాస్య మిదం సర్వం' అనే ఏడవ కాండలో కవి గావించిన ప్రబోధం ప్రజలందరికీ ఆవశ్యముగా అనుసరణీయం.

విశ్వమంతా ఈశ్వరుని ఆవాసమే అని ప్రతి మానవుడు భావించిననాడు లోకంలో కుల మత భేదాలూ, వాదాలూ ఉండవనీ, త్యాగమూ, సమతా, మమతా, సుఖమూ, శాంతా, ధర్మమూ మొదలైన మంచి లక్షణాలు విస్తరిస్తాయనీ కవి ప్రబోధించారు.

'మనములన్నిట తన వారె మనలు దుంద
మనుజులందర భారతాత్మయె వసింప
నేం హైందవునకు దురపిల్ల నాక!
ఏలు కొనదగు సర్వంలనేక పరచి'!
'ఎల్ల సద్గుణమ్ము లే హిందు మతమగు'

మత దురభిమానముం సిత' 'మనముల పలుకుం పనులన్ మనుటయె ధర్మమ్ము నూది మతమగు మామన్' ఈ మొదలైన హితోక్తులు దేశసమైక్యతను, దేశ సౌభాగ్యన్ని సమకూరుస్తాయి.

ఈ విధంగా కొండయ్యగారు చక్కని ప్రబోధాత్మకమైన కావ్యం రచించి అందరికీ అభినందనీయులయ్యారు.

**వేముగంటి**

# మానస వీణ
## (కవితా సంపుటి)

ఈ పుస్తకం పద్యగేయాత్మక కవితా సంపుటి. ఇందులో కవి మానస వీణానాదాలు రకరకాలుగా వినిపిస్తాయి. ఆంధ్రప్రశస్తి, భరత జగతి మొదలైన జాతీయగీతులు, నన్నయ, పోతన వదదాచార్యులు, దాశరథి, ప్రభృతి కవి ప్రశంసా స్వరాలు ఈ మానస వీణ వినిపిస్తున్నది. ఇంకా శాంతానందయోగీశ్వరులు, మిట్టపల్లి రాజయ్య వంటి మహాత్ముల సంస్కారణ రణిస్తున్నది. ఈ మానసవీణ విజయోస్తు. సమాజం బండి పట్టా తప్పింది. సమత మమత వెంగాలి, నేతకార్మికా

యువశక్తి, ఋణబాధ, శాంతి నీ వెక్కుతున్నావు మొదలైన శర్షికలు వివిధ భావాలరాగాల సమ్మేళనం ఈ వీణ ద్వారా వినగలం.

పద్యాన్ని హృద్యంగా గేయాన్ని హాయిగా నడిపించడంలో వేంకటరాజంగారిది అందె వేసిన చేయి. పద్యం ధారాళంగా, స్పష్టత, భావ గాంభీర్యం, పదముల సొగసులు పొదివికొని సాగుతుంది. ఇందుకు రెండు మూడు ఉదాహరణలు.

'నా పన్ బోయెను పొందులెంత కిరిగో
'నాపిల్ల, నా ముల్లె' యం
దా వేగంబున బొబ్బ పెట్టుదురు
ఘోరాంబోధి మధ్యంబునన్
నా వేమున్గిన నేమి దిక్కు నకటా!
నా నా త్వచింతా రతిన్
బోవన్ పేరులు, దేశమే గతికి
పోవున్ దీని యోచింపుడీ!'
(స్వతంత్ర భారతము)

ఇందులోని సారళ్యత, భావగరిమ గమనింపదగినవి.

మరొక మేలైన పద్యం.

'అన్న మొసంగి నిల్పు మన
ప్రాణములన్ రయితన్న, దానికిన్ మిన్నగు మానమున్ నిలుప


రచయిత—డా. అందె వేంకటరాజం
వెల రూ 30-00
ప్రతులకు—డా. అందె వేంకటరాజము
మహేశ్వరీ గ్రంథ మండలి
2-3-18, మార్కండేయమందిరం వద్ద
కోరుట్ల—506 316, జి॥ కరీంనగర్


మేలిమి బట్టిలో నంగు వాడు నే
తన్న సమస్త సంస్కృతికి
అతని బట్టలు పట్టుగొమ్మ లా
యన్నమె యన్న వస్త్రములు
శాశ్వతముగుండుట సిగ్గు జాతికిన్'
(జీనేత వైభవము)

ఇంకొక చక్కని పద్యం.

'నన్నయ్య! తెలుగు కవితకు
తన్నయ్య! నితాంత రమ్య కావ్యవి రచనన్
మిన్నయ్య! ఆంధ్ర కవులకు
అన్నయ్యా! అనంతకోటి అభివందనముల్!'
ఆదికవి నన్నయ్య!

ఈ పద్యంలోని అను ప్రాస విలాసము భాసరము కదా!

ఇక వేంకటరాజం గారి గేయాల తీరు పరిశీలిద్దాం.

ఉపాధ్యాయుని గూర్చి చెప్పిన ఈ దిగువ గేయ చరణాలు ఎంతో కమనీయంగా సాగినవి.

'బ్రతుకు నేర్పు బడిపంతులు
బ్రతుకు లేని మానవుడా?
జ్యోతిని వెలిగించు గురువు
చుట్టు అంధకారంబా!'
'మూడవ దేవుని దాతడు
ముజ్జగాలలో పూజ్యుడు
గురువనగా ప్రబుద్ధులకు
పరువు లేని బరువయ్యెను.'

యువశక్తిని కవి వివరించిన తీరు ఇలా ఉంది.

'సింహకిశోరమ్ముల వలే
సింధుతరంగమ్ముల వలె
ధరాధర ఝురమ్ముల వలె
ఉరుకు పరుగులెత్తు యువత'

మూర్ఖశిఖామణి ఇలా ఉంటాడట.

'పిండవచ్చు బండనూనె
మొండిగుండె నెనరుండరు

కరగవచ్చు వజ్రమైన
కఠినుని మొర కరగబోదు'

పద్యంగానీ, గేయంగానీ అందెవారి చేతిలో చక్కని చిక్కని సోయగాలను సంతరించుకుని సాగినవి వెంకట రాజంగారు ఈలాంటి ఒక మంచి కవితా సంపుటి అందించినందుకు అభినందనీయులు!

వేముగంటి

# వార్తా వాహిని

## నల్గొండ జిల్లా అమృతోత్సవ హిందీ మహాసభలు

### హిందీ ప్రచారకుల సదస్సు

తేదీ– 23–7–95 ఆదివారం ఉదయం 11–00 గం|| లకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర కార్యాధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారి, అధ్యక్షతన జిల్లా హిందీ ప్రచారకుల సదస్సు స్థానిక ఆర్య వైశ్య కళ్యాణ మండపమునందు జరిగినది. శ్రీ యమ్. హనుమంత రావు, అధ్యక్షులు, హిందీ ప్రేమీ మండలి, ముఖ్య అతిథులను వేదిక పైకి ఆహ్వానించగా, కార్యదర్శి యమ్. పూర్ణచంద్రరావు స్వాగతోపన్యాసం చేసిరి. ఆంధ్ర ప్రదేశ్ హిందీ ప్రచారక మండలి. అధ్యక్షులు శ్రీ రాజ వెంకటేశ్వరరావుగారు హిందీ ప్రచారక సదస్సును ప్రారంభించగా స్థానిక యన్. జి డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ బి. విశ్వనాథం, ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ యన్. భాస్కరరావు, ఆర్గనైజర్ మరియు సభ కోశాధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి ఆంధ్ర సభ కార్య వర్గ సభ్యులు సభ మాజీ కార్యదర్శి శ్రీ గోదా తిరుమలయ్య తెలంగాణా హిందీ ఆర్గనైజర్ శ్రీ కదారు మల్లయ్య, జిల్లా యు. టి. యఫ్. నాయకులు శ్రీ యన్. ఆంజనేయులు, యస్. టి. యు జిల్లా అధ్యక్షులు శ్రీ బి. అంజయ్య పండిత పరిషత్ జిల్లా నాయకులు శ్రీ దండా వెంకటరెడ్డి సభలో ప్రసంగించిరి.

స్థానిక ఎమ్. ఆర్. ఓ. శ్రీ బాలనర్సయ్య, ఆంధ్ర సభ కార్యవర్గ సభ్యులు శ్రీ సయ్యద్ హుస్సేన్ మరియు జిల్లా హిందీ పండితులు సభలో పాల్గొనిరి.

ముఖ్య అతిథి డా|| ఎమ్. జగన్మోహన్ ఎమ్. యస్సి. పి హెచ్.డి. ఆర్.డి.ఓ. నల్గొండ గారు హిందీ ఆవశ్యకతను వివరిస్తూ దక్షిణ భారత హిందీ ప్రచార సభ సేవలను కొనియాడిరి హిందీ సరళమైన, మధురభాష, అని, దేశం అల్లకల్లోలంగా వున్న ఈ పరిస్థితులలో జాతీయ సమైక్యత కొరకు హిందీ అందరూ నేర్చుకోవాలని సందేశమిచ్చినారు. ఉపాధ్యాయపండిత పరిషత్ జిల్లా అధ్యక్షులు శ్రీ పి పాండరయ్యగారు వందన సమర్పణ చేసినారు.

## అమృతోత్సవ మహాసభ :

మధ్యాహ్నం 4 గంటలకు అమృతోత్సవ జిల్లా హిందీ మహాసభ జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీ కొల్లు మధుసూదన్ రావుగారి అధ్యక్షతన జరిగింది. రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీ టి.ఎల్. నరసింహారావుగారు స్వాగతోపన్యాసం చేసిరి. ముఖ్య అతిథులుగా సూర్యాపేట పురపాలక సంఘం అధ్యక్షులు శ్రీ జట్టుకొండ సత్యనారాయణగారు డి.ఎస్.పి శ్రీ జె. వెంకయ్యగారు విచ్చేసినారు.

దక్షిణ రాష్ట్రాలలో హిందీ భాషాభివృద్ధికి ప్రతి ఒక్కరూ కృషిచేయాలని, మున్సిపల్ అధ్యక్షులు శ్రీ జట్టు కొండ సత్యనారాయణగారు విజ్ఞప్తి చేసిరి డి. ఎస్ పి శ్రీజె. వెంకయ్యగారు జాతీయ సమైక్యతకు ప్రతిఒక్కరూ హిందీ నేర్చుకోవాలని పిలుపు నిచ్చారు రైస్‌మిల్లర్స్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ మొరిశెట్టి సత్య నారాయణగారు దక్షిణ భారత దేశంలో హిందీ ప్రచారం సక్రమంగా జరగటానికి ఏదైనా అవ రోధాలుంటే అందరూ సమైక్యంగా, ఎదుర్కొవా లన్నారు. విజయభాను కళాసమితి ఉపాధ్యక్షులు శ్రీ మాలా యాదగిరి హిందీ భాష ఆవశ్యకతను నొక్కి వక్కాణించారు. డి. బి. హెచ్ పి సభ ఆంధ్రశాఖాధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు హిందీ భాషాభివృద్ధికి దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఎంతో కృషి చేసిందని తెలిపారు. సభ కార్యదర్శి శ్రీ ఎ. శంకరశాస్త్రి మాట్లాడుతూ 1994 మార్చినెలలో భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారి ఇంటిలో ఈఅమృతోత్స వములు జరుపుకున్నామని, అప్పటినుండి రాష్ట్ర వ్యాప్తంగా జిల్లాల వ్యాప్తంగా ఈ అమృతోత్సవాలు జరుగుచున్నాయని చెప్పినారు.

హిందీ ప్రేమీ మండలి, సూర్యాపేట పక్షాన హిందీ భాషాభివృద్ధికి సేవ చేసిన హిందీ పండితులను శ్రీ కె. శేషం రాజు, శ్రీ నాగం మల్లారెడ్డి, శ్రీ టి. చంద్రయ్య, శ్రీ వి. సత్యనారాయణ శ్రీ కె. జనార్ధన్ శ్రీ ఏ. సాయన్నలను సన్మానించారు. అమృత హిందీ పరీక్షకు 400 మంది విద్యార్థు లను తయారు చేసిన ప్రభుత్వ ఉన్నత పాఠశాల హిందీ పండిత్ శ్రీ ఎమ్. వెంకటరెడ్డి నల్గొండ– గీతా విజ్ఞాన మందిర్ ఉన్నత పాఠశాల హిందీ పండిట్ శ్రీ ఎన్. ఆంజనేయులు, సెయింట్ జేవి యర్స్ ఉన్నత పాఠశాల హిందీ పండిట్ ఎమ్. పూర్ణచంద్రరావులను ఆంధ్ర శాఖ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు సన్మానించిరి. అమృ తోత్సవాలలో, మరియు ప్రచారకుల సదస్సులో పాల్గొన్న పుర ప్రముఖులకూ, ముఖ్య అతిథులకూ మెమెంటోలు అందజేసారు హిందీ ప్రేమీ మండలి కార్యదర్శి ఎమ్. పూర్ణ చంద్రరావు వందన సమ ర్పణ తర్వాత జాతీయ గీతాలాపనతో అమృతోత్సవ మహాసభలు విజయవంతంగా ముగిసినవి

# 16 వ వాణీ హిందీ విద్యాలయ ప్రమాణపత్ర వితరణోత్సవం

తే. 5-8-95 వ సా॥ 5 గం.లకు విజయనగరం లోని ఉల్లివీధి వాణిజ్య భవన్‌లో వాణీ హిందీ విద్యాలయ 16 వ వార్షికోత్సవం మరియు ప్రమాణపత్ర ప్రదానోత్సవం కడు రమ్యం గా జరిగినవి.

ప్రార్థనాగీతం వై.ఎస్ కుమారి, అరుణశ్రీ ఆలపించిరి. ముఖ్య అతిథి శ్రీ ఎల్.ఎస్. కామేశ్వర రావు గారు బి.కాం., అధ్యక్షులు ఛాంబర్ ఆఫ్ కామర్స్, విజయనగరం సరస్వతి చిత్రపటాన్ని పూలమాలలతో అలంకరించి, జ్యోతిని వెలిగించిరి. సభాధ్యక్షులుగా శ్రీ వాహినీపతి లింగమూర్తి ఎం.ఏ., బి.ఎడ్, (ప్రధానోపాధ్యాయులు, మున్సిపల్ హైస్కూల్, కస్పా విజయనగరం) గారు వ్యవహరించిరి. స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ వై. అంజనేయులు పరిచయం చేసిరి. పెద్ద సంఖ్యలో విచ్చేసిన విద్యార్థినీ, విద్యార్థులకు వారి తన ప్రత్యేక ధన్యవాదములు తెలిపిరి.

వక్తలుగా విచ్చేసిన డా॥ శ్రీ కె. సుబ్రహ్మణ్యం హిందీ రీడర్ ఎం.ఆర్.కాలేజీ, విజయనగరం గారు హిందీ సాహిత్య విలువలను కొనియాడుతూ, కబీరు దోహాలను సభకు వినిపించిరి. విద్యాలయంలో విజేతలైన 18 మంది విద్యార్థులకు, ప్రతిభావంతులైన ఉపాధ్యాయులకు బహుమతి ప్రదానం ముఖ్య అతిథి చేసిరి. అధ్యక్షులు శ్రీ లింగమూర్తి గారు, హిందీ ప్రచారకులు శ్రీ వై. ఆంజనేయులు చేస్తున్న కృషిని ప్రశంసించి, దేశ ఐక్యతకు హిందీ భాష ఎంతో అవసరమని, వివరించిరి. తదుపరి హిందీ ప్రచారకులు తన వార్షిక రిపోర్టులో (శ్రీ వై. ఆంజనేయులు) ఈ సంస్థలో చదువుచున్న విద్యార్థులు తనకు మంచి పేరు తెచ్చి పెడుతున్నారని ఇప్పటికే అనేకమంది హిందీ పండితులుగా పని చేస్తూ, వారి జీవితాలను సుగమంగా నడుపుచున్నారని సభకు తెలియచేసిరి. ముఖ్య అతిథి శ్రీ కామేశ్వరరావు గారు మంచి మార్కులతో పాస్ అయిన విద్యార్థులకు నగదు బహుమతులను ప్రకటించిరి. తదుపరి తన సందేశంలో భారతదేశంలో హిందీ ఇంకా బాగా అభివృద్ధి చెందాలని, హిందీ రానివారు మనదేశంలో ఇక మునుముందు వుండరాదని, పెద్దసంఖ్యలో హిందీ ప్రచారకులు ఆంజనేయులు వలే హిందీ ప్రచారం చేయాలని అభిలషించిరి. విద్యార్థులను ఆశీర్వదిస్తూ, హిందీ బాగా నేర్చుకొని తల్లిదండ్రులకు, గురువులకు మంచి పేరు తేవాలని కోరిరి. శ్రీ కామేశ్వరరావు సుమారు 200 మందికి సర్టిఫికెట్లు అందచేసిరి. పిల్లలకు స్వీట్సు పంచిరి. వై. ఈశ్వరి, హిందీ పండిట్ వందనసమర్పణ చేయగా రాత్రి 8 గం॥లకు జనగణమన జాతీయగీతంతో సభ ముగిసింది.

# ప్రమాణిత్ ప్రచారకులకు విజ్ఞప్తి

1. 18సం॥ల వయస్సు కలిగి దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు వారి విశారద, ప్రవీణ పరీక్షల ఉత్తీర్ణులైనవారు అర్హులు.

2. ద్వితీయ శ్రేణి (दूसरी श्रेणी) ప్రమాణిత్ ప్రచారక్ కాగోరువారు దరఖాస్తు గురించి రూ॥ 1-00 *I.P.O* తీసుకొని, కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర-ఖైరతాబాదు, హైదరాబాదు-4 పేరు మీద 1-00 స్టాంపు అతికించి మీ చిరునామా, వ్రాసిన జవాబు కవరు జతపరిచి సభ కార్యాలయమునకు పంపి, దరఖాస్తు తెప్పించుకొనవలెను.

3. ద్వితీయ శ్రేణి దరఖాస్తును, పూర్తిగా నింపి విశారద/ ప్రవీణ పాసైన ప్రమాణ పత్రము ప్రతి లిపిని జతపరచి, రూ॥ 20=00ల *I.P.O.* లేదా బ్యాంక్ *D D* తీసుకొని సభ కార్యాలయమునకు పంపవలెను.

4. తాత్కాలిక ప్రమాణపత్రము (*provisional certificate*) 1 సం॥ వరకు ఉపయోగపడును.

5. ప్రమాణిత్ ప్రచారక్‌లు వారి చందా రూ॥ 20-00 లను నవంబరు 30లోగా సభ కార్యాలయమునకు పంపుచూ, పూర్తి చిరునామా, జిల్లా, పిన్‌కోడ్ పేర్లు ప్రమాణిత్ ప్రచారక్ నెంబరు వ్రాసి సభ కార్యాలయమునకు పంపవలెను.

6. ప్రమాణిత్ ప్రచారక్ అయిన వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) వారు నిర్వహించు ప్రాథమిక మధ్యమ మరియు రాష్ట్రభాష పరీక్షలకు కనీసం 20 మంది విద్యార్థులను తయారుచేసి సభ నుండి అనుదానం (గ్రాంట్) పొందవచ్చును.

7. ప్రమాణిత్ ప్రచారక్‌గా గుర్తింపు పొందిన నాటి నుండి దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు నుండి హిందీ ప్రచార్ సమాచార్ అనే పుస్తకం పరీక్ష శుల్కము, పరీక్ష తేదీలు, ప్రశ్నా పత్రములు మొదలగు వివరములు గల పత్రిక పొందగలరు.

8. మీరు ప్రమాణిత్ ప్రచారక్ చందా చెల్లించనట్లైతే మీకు సమాచార్ పత్రిక రాదు.

9. ద్వితీయ శ్రేణి ప్రమాణిత్ ప్రచారక్ అయిన తర్వాతనే ఆజీవన్ (శాశ్వత) ప్రచారక్‌గా గుర్తింపు పొందుటకు అర్హులు

10. శాశ్వత ప్రచారక్ కాగోరు వారు, ప్రమాణిత్ ప్రచారక్ నెంబరుతో, వివరములు వ్రాసి, పాస్‌పోర్టు సైజు ఫోటో జతపరచి రూ॥ 200-00 లను *I.P.O.* లేదా *D. D.* తీసుకొని సభ కార్యాలయమునకు పంపవలెను.

11. శాశ్వత ప్రచారక్‌లు ద్వితీయ శ్రేణి అయితే 1 సం॥ తర్వాత ప్రథమ శ్రేణి (पहली श्रेणी) కి రూ॥ 5/-లను ప్రథమ శ్రేణి దరఖాస్తు పూర్తిచేసి, ప్రవీణ ప్రమాణ పత్ర ప్రతి లిపిని జతచేసి సభ కార్యాలయమునకు పంపవలెను.

12. శాశ్వత చందా కట్టిన ప్రచారక్‌లు సంవత్సరపు చందా చెల్లించనవసరములేదు.

యోజనా విభాగము

# నల్గొండ జిల్లా హిందీ అమృతోత్సవ మహాసభలు



ది 28-7-93న జరిగిన నల్గొండజిల్లా అమృతోత్సవ హిందీ మహాసభలో ప్రసంగించుచున్న నల్గొండ ఆర్. డి. ఓ. శ్రీ ఎం. జగన్మోహన్‌గారు, యు. టి. ఎఫ్. జిల్లా నాయకులు శ్రీ ఎన్. ఆంజనేయులుగారు, మరియు ఆంధ్రసభ కోశాధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తిగార్లను చిత్రంలో చూడవచ్చు.

Edited Pirinted and Published by A. Sankara Sastry on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad–500 004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad–500 004.